శ్రీరస్తు.

వండపల్లె ఆగమిక నంజుండదీక్షితవిరచిత

# వాస్తుసర్వస్వము

శల్యజలధనవాస్తుసహితము.

సాంధ్రతాత్పర్యము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1924

శ్రీ గస్తు.

# వాస్తుసర్వస్వము.

---

## శల్యవాస్తువు.

శ్లో. ద్వాత్రింశద్వాస్తుశాస్త్రాణి సమాలోచ్య ప్రయత్నతః, శల్యవాస్తు ప్రవక్ష్యామి వాస్తుసర్వస్వసంగ్రహే. 1

తా. పంచాశత్కోటియోజనవిస్తీర్ణమగుభూమండలంబున గలమనుజులశుభమునకై పూర్వమున బ్రహ్మ మొదలగువారలు చేసిన ముప్పదిరెండు వాస్తుశాస్త్రములను సంగ్రహించి వాస్తుసర్వస్వసంగ్రహమును చెప్పఁబూనుకొని యాదియందు శల్యవాస్తువునంతయును జేర్చి చెప్పుచున్నాను.

జ్యోతిర్నిబంధమున:—

స్మృత్వేష్టదేవతాం ప్రష్టుర్వచనన్యాద్యమక్షరమ్, గృహీత్వా తు తత శ్శల్యాశల్యం సమ్యగ్విచారయేత్. ౨

గృహయజమానుండు గృహారంభకాలమునందైనను, సూత్రారంభకాలమునందైనను, మఱియొకప్పుడైనను జ్యోతిస్సిద్ధాంత

వేత్తదగ్గరకు వచ్చి తనయిష్టదేవతను ప్రార్థించి ప్రశ్న నడుగఁ నాదైవజ్ఞుఁడుప్పృచ్ఛకుని ప్రశ్నాద్యక్షరమునుబట్టి శల్యములను నిర్ణయింపవలయును.

> అకచటతపయశహాపయా వర్ణాః పూర్వాది
> ధ్యాంతాః, శల్యకరా ఇహ నాన్యే శల్యగృహే
> నివసతాం నాశః. ౬

తూర్పుపడమరలుగా రగీతలును ఉత్తరదక్షిణములుగా నాలుగుగీతలను గీయఁగా తొమ్మిదియిండ్లు గలచక్ర మగును. ఆచక్రమునందు ప్రాగాదిదక్షిణముగా అ, క, చ, ట, త, ప, య, శ, వర్గులను వ్రాసి ప్రశ్నచేసిన యక్షరములలో మొదటియక్షరము యీతొమ్మిదివర్గులలో నేవర్గమున నుండునో, ఆవర్ణముండు దిశయందు దాయాశల్యము లుండు నని తెలియావలయును. ఎట్లన, తూర్పుదిశయందు అ, ఆ, ఇ, ఈ మొదలగుపదియారుస్వరములను, ఆగ్నేయదిశయందు కవర్గమును, దక్షిణదిశయందు చవర్గమును, నిరృతిదిశయందు టవర్గమును, పడమటిదిక్కున తవర్గమును-వాయుదిశయందు పవర్గమును, ఉత్తరమున యవర్గమును, ఈశాన్యదిశయందు శవర్గమును, మధ్యమమునందు హ, ప, య అను మూఁడక్షరములను వ్రాసి గంధాక్షతచేత పూజించి ప్రశ్నమొదటి యక్షర మేగదిలో నుండునో, ఆయక్షరమున కుపయుక్తమైనశల్యమును తీయవలయును. ఇందు హ, ప, య అనుమూడక్షరములు ముందువర్గములో చేరియున్నను, మధ్యమమున చూడవలయును.

| శ | అ | క |
|---|---|---|
| య | హ-ప య | చ |
| ప | త | ట |

ఈ చక్రమునం దక్షరవర్గసంఖ్య ననుసరించి ప్రాగాదిదిశలయందు శల్యములను తీయవలయును.

పృచ్ఛాయాం యది అః ప్రాచ్యాం నరశల్యం తదా భవేత్, సార్థహస్తప్రమాణేన తచ్చ మానుష మృత్యుకృత్. ఆగ్నేయ్యాం దిశి కః ప్రశ్నే ఖర శల్యం కరద్వయే, రాజదండో భవేత్తత్ర భయం నైవ నివర్తతే. యామ్యాయాం దిశి చః ప్రశ్నే కుర్యా దాకటిసంస్థితమ్, నరశల్యం గృహేశస్య మరణం చిరరోగతః. నైర్‌ఋత్యాం దిశి టః ప్రశ్నే సార్థహస్తా దధస్స్థలే, శునోఽస్థి జాయతే తత్ర బాలానాం జనయే న్మృతిమ్. తః ప్రశ్నే పశ్చిమాయాం తు శిశో శ్శల్యం ప్రజాయతే, సార్థహస్తే గృహస్వామీ నతిష్ఠతి గృహే సదా. వాయవ్యాం దిశి పః ప్రశ్నే తుషాంగా ఉశ్చతుః కరే, కుర్వంతి మిత్రనాశం చ తదా దుస్స్వప్నదర్శనమ్. ఉదీచ్యాం దిశి యః ప్రశ్నే విప్రశల్యం కటే రథః, తచ్ఛీఘ్రం నిర్ధనత్వాయ కుబేరసదృశస్య హి. ఈశాన్యాం దిశి శః ప్రశ్నే

గోశల్యం సార్ధహస్తతః, తద్గోధనస్య నాశాయ
జాయతే గృహమేధినః. హపయో మధ్యమే కో
ష్ఠే పక్షోమాత్రే భవే దధః, నృకపాల మధో
భస్మ లోహం తత్కులనాశకృత్ 4

పృచ్ఛకుఁడు వచ్చి దైవజ్ఞుని ప్రశ్నచేయునపుడు ఆప్రశ్న చేయునపుడు ఆప్రశ్న మొదటియక్షరము అకారము మొదలు ౧౼ అక్షరములో నున్నయెడల గృహమునకు దూర్పుభాగమునందు ౧౹ హస్తప్రమాణములోఁతున మనుష్యులకు మృత్యువును కలుగచేయు మనుజశల్యము లుండును. ఆప్రశ్నాద్యక్షరము కవర్గములో నున్నట్లైన నాగ్నేయభాగమున రెండు హస్తములలోతున గర్దభశల్యములుండును. దానికి ఫలము తీరనిరాజదండనము కలుగును. ఆప్రశ్న జవర్గములో మొదటియక్షరమున్నయెడల దక్షిణమున కటిప్రమాణములోతున మనుష్యునియెముక లుండును. దానివలన గృహయజమానునికి చిరరోగమువలన మరణము గలుగును. ఆప్రశ్నాద్యక్షరము టవర్గువులోనున్నయెడల నిర్భతిదిశయందు ౧౹ చేతిలోతున కుక్కయెముకలుండును. దానికిఫలము పిల్లలు మృతినొందుదురు. ప్రశ్నాద్యక్షరముతవర్గువునందున్నయెడల పడమటిదిశయందు శిశుశల్యములు ౧౹ చేతెడు లోతున నుండును. దానికి ఫలము గృహయజమాని దేశద్రిమ్మరి యగును. ప్రశ్నాద్యక్షరము పవర్గమననున్నట్లైన వాయవ్యదిశయందు నాలుగుచేతులలోతున నుముకబొగ్గులుండును. దానికిఫలము మిత్రనాశనము గలుగును. ప్రశ్నా

ద్యక్షరము యవర్గువునం దుండినయెడల కటిప్రమాణములోతున నుత్తరపుదిశయందు బ్రాహ్మణునియెముకలుండును. దానికి ఫలము కుబేరునివంటి ధనికుఁడైనను దరిద్రుఁడుగా నగును. ప్రశ్నాద్యక్షరము శవర్గువులోనున్నయెడల నీశాన్యపుదిశయం దొకటిన్నర చేతెడులోతున పశువులయెముక లుండును. దానికి ఫలము గృహయజమానునిపశువులు నశించుచుండును. మఱియు ప్రశ్నాద్యక్షరము హ, ప, య, అను నక్షరములలోనున్నయెడల గృహమధ్యభాగమునందు ఎదుపుబొమ్మలోతున మనుజునితలపుఱ్ఱికాని, బూడిదకాని, యినుపముక్కకాని యుండును దానికి ఫలము కులనాశనమగును. కనుక గృహములను కట్టువారు బాగుగా విచారించి శల్యపరీక్షచేసి తీయించి గృహములను కట్టవలయును.

మఱియు సర్వసారసంగ్రహంబున.—

సీ. సూత్రంబుఁ బట్టెడిచోటికి నెవరైన
వచ్చి యావర్గువువర్ణములను
ప్రశ్నచేసిన నింద్రుపదమున నిలువున
గజపక్షిశల్యము ల్గానుపించు
రహిఁ గవర్గోచ్చారప్రశ్నచే నాగ్నేయ
మున హస్తమున మేషమూషకాది
శల్యంబు లుండు నెంచఁగఁ జవర్గోచ్చార
ణప్రశ్నచే దక్షిణమున హస్త
మాత్రాంతరమ్మున మహిషశల్యము లుండు
ధృతిఁ డవర్గువు నుచ్చరించి ప్రశ్న

కోరిన నిరృతికోణాన హస్తమా
　త్రంబున శునకఖరాస్థు లుండు
దగఁ దవర్గోచ్చారితప్రశ్న చేఁ బశ్చి
　మమున హస్తద్వయమాత్రమునకు
సర్పనక్రంబులశల్యంబు లుండును
　రహిఁ బవర్గాక్షరప్రశ్న చేత
మారుతదిశ హస్తమాత్రాంతరమున మూ
　షకకురంగాస్థులు సరవి నుండు
రమణ యవర్గాక్షరప్రశ్న చేత ను
　త్తరమున నిలువునఁ గరితురంగ
శల్యంబు లుండుఁ గొంచక శవర్గాక్షర
　ప్రశ్న చే నైశాన్యబాహుమాత్రఁ
గర్తాంతరంబునఁ గనిపించు శశవృష
　శల్యము ల్వర్గాంతసమితి నుచ్చ
తే. రించు ప్రశ్నను దగఁ బరికించ నచట
　శల్యములు లేవు గావున జగతి శల్య
　శోధనముఁ జేసి రచియింప శోభనంబు
　మూఢమతిఁ గట్టరా దండ్రు మురవిదారి! 5

సూత్రముచేత నింటికి కొలఁత కొలచునపుడు అచ్చటి కెవ్వరైననువచ్చిఆవర్గులోనియక్షరములాదియక్షరములుగనుండునట్లు ప్రశ్న చేసినవైనతూర్పునమనుష్యనిప్రమాణములోతున నేనుఁగుఎముకలైనను, పక్షియెముకలైననుకనుపడును. ప్రశ్నాద్యక్షర

ము కవర్గమునం దుండినట్లైన నాగ్నేయదిశయందు చేతెడులో తున మేఁక, యెలుక యెముకలుండును. ప్రశ్నాద్యక్షరము చవర్గ మునం దున్నయెడల దక్షిణదిశయందు చేతెడులోతున దున్న పోతుయెముక లుండును. ప్రశ్న మొదటియక్షరము టవర్గము నం దుండినయెడల నిరృతిదిశయందు హస్తప్రమాణములోతున కుక్క యెముకలుగాని గాడిదయెముకలుగాని యుండును. ప్రశ్నాద్యక్షరము తవర్గమునం దుండినట్లైనఁ బశ్చిమదిశయం దు రెండుచేతుఁ లోతునపాము యెముకలుగాని మొసలియెముకలు గాని యుండును. ప్రశ్న మొదటియక్షరము పవర్గమునం దుండిన ట్లైన వాయవ్యదిశయందు హస్తప్రమాణగర్తమందు ఎలుకయె ముకలుగాని యిఱ్ఱియెముకలుగాని యుండును. మఱియు ప్రశ్నాద్యక్షరము శవర్గమునందుండినచో నీశాన్యదిశయందు చేతెడులోతునఁ గుందేటియెముకలుగాని వృషభశల్యములు గాని యుండును. మఱియు వర్గాంతములగు ఙ, ఞ, ణ, న, మ యను నీ యక్షరము లాద్యక్షరములుగా ప్రశ్న చేసినయెడల నచ్చట శల్యము లుండవని తెలియవలయును. ఇటువలె విచా రించి గృహములను కట్టినట్లైన సకల శుభములు కలుగును.

సీ. వర్గశుద్ధిగ సూత్రంబు పట్టునపుడు
సూత్ర మేజంతువులు దాఁటు సొరిది నచట
మహిని ద్రవ్వీన మనుజప్రమాణమునను
వానిశల్యంబు లుండు నవశ్యముగను. 6

వర్గశుద్ధితో గృహమునకు సూత్రమునుపట్టునపుడు ఆసూత్రము నేజంతువు దాటునో, ఆప్రదేశమున మనుజప్రమాణము త్రవ్విన నాయాజంతువులకొముక లుండును

సీ. గొనకొని సూత్రంబుఁ గోడి దాఁటినఁ దూర్పు
దెసఁ బక్షిశల్యము త్రేటపడును
బిల్లి దాఁటినఁ గానిపించుఁ దచ్ఛల్యము
లాగ్నేయమున లులాయంబు దాఁట
శమనుదిక్కున మహిషపుశల్యములు నుండు
శుని దాఁట నైరృతియునికిపట్టు
దానిశల్యము లుండు వడి వృషభంబు దాఁ
టిన వానినెమ్ము లుండును జలేశు
కడను రాసభము సంగతి దాఁట దానినె
మ్ములు వాయుదెస నుండు మొనసి హయము
దాఁటఁ దచ్ఛల్యము ల్ధనదుదిక్కున నుండుఁ
గాకి చాఁటిన శశకమ్ము నెమ్ము
నీశాన్యమున నుండు నెలమితో మనుజుఁడు
దాఁటిన మధ్యమస్థానమునను
మనుజులనెమ్ములు గనుపించు నభ్యక్తుఁ
డట వచ్చి యేదిక్కు నరసి చూచు

గీ. నచట డెబ్బదిమూఁడుమాత్రాంగుళముల
లోతున మనుష్యశల్యము ల్దోఁచు వెత్తి

వాఁడటకు వచ్చి నిచ్చుచోఁ జూడ మాన
వాస్థు లుండు నశీత్యంగుళాంతరమున. 7

సూత్రమును పట్టుసమయంబున నాసూత్రమును కోడిదాటి
నతూర్పుదిశయందు పక్షిశల్యము లుండును. పిల్లి దాఁటిన నా
గ్నేయభాగమున మార్జాలశల్యము లుండును. దున్నపోతు దాఁ
టిన దక్షిణమున దానియెముక లుండును. కుక్క దాఁటిన నైరృ
తిదిశయందు కుక్కయెముక లుండును. ఎద్దు దాఁటిన పడమటి
దిశయందు ఎద్దుయెముక లుండును. గాడిద దాఁటిన వాయవ్య
దిశయందు దానియెముక లుండును. గుఱ్ఱము దాఁటిన నుత్తర
దిశయందు దానియెముక లుండును. కాకి దాఁటిన నీశాన్యదిశ
యందు గుండేటియెముక లుండును. మనుష్యుఁడు దాఁటిన గృ
హమధ్యభాగమున మనుజశల్యము లుండును. నూనెఁ దలంటు
కొనినవాఁడటకువచ్చి యేదిశను చూచునో, ఆదిశయందు డెబ్బ
దిమూఁడుమాత్రంగుళములలోతున మనుజశల్యము లుండును.
పిచ్చివాఁడాప్రదేశమునకు వచ్చి యేదిశను చూచునో, ఆదిశ
యందెనిమిదియంగుళములలోతున మనుష్యశల్యములుండును.

మ. సుమతీ శల్యము లిందు లేవు గద యంచుం
బ్రశ్న గావింపఁ దత్సమయం బొరసి వాస్తువేది
వెసఁ బాదచ్ఛాయలన్ దంతినేత్రములుం గూరి
చి భానుసంఖ్య నిరవందన్ బెంచి షట్సోమభా
గము గావింపఁగ శేషసంఖ్య ఫలమార్గంబు లన్వే
చింపందగున్. 8

గృహావరణము నేర్పరచునపుడు పెద్దలచటికి వచ్చి యా ప్ర దేశమున శల్యములు లేవు గదాయని యడుగ వాస్తుశాస్త్రము నెఱింగినవారు అపుడు పాదచ్ఛాయలు వేసి యాసంఖ్యను నొక చోటవ్రాసి దానితో ౨౮ చేర్చి ౧౨చేత పెంచగా వచ్చిన సంఖ్య ను ౧౩చేత భాగించగా శేషించినసంఖ్యకు ఫలము ముందఱిప ద్యమునఁ జెప్పఁబడును.

సీ. శేష మేకో త్తరాంచితవృద్ధి ప్రాగాది
దిశలఁ బదాఱింటఁ దెలియ వరుస
నిల నుండును గపాల మిటికెయుఁ బెంకులు
కప్పలు దైవసంఘముల నెలవు
బూడిదె శవమును బొగ్గులు ధాన్యంబు
ధనము పాషాణంబు దర్దురంబు
గోశల్యసమితియుఁ గుఱ్ఱె నెమ్ములును భూ
తము పిశాచాదిసంస్థాపనంబు
గీ. ప్రశ్నలక్ష్మణ మీరీతిఁ బరఁగియుండుఁ
గావున ధరిత్రి శోధింపఁగాఁ బొసంగు
వెలయు నందు శుభాశుభంబులను దెలిసి
యిండ్లు గట్టినఁ దత్ఫలం బెసఁగుఁ గృష్ణ! 9

శేషము పదాఱునఱకు మిగిలినందుకు తూర్పు మొదలు ప్రద క్షిణాక్రమముగ ఫలములు చెప్పుచున్నాఁడు. ౧మిగిలిన తూర్పు దిశయందు తలపుర్రె యుండును. ౨. మిగిలిన ప్రాగాగ్నేయమ ధ్యములయందు ఇటిక లుండును. 3 మిగిలిన నాగ్నేయభాగ మందు పెంకు లుండును. ౪ మిగిలిన నాగ్నేయ దక్షిణముల

మధ్యమందు కప్పలుండును. ౫ మిగిలిన దక్షిణదిశయందు దేవతాగ్రహము లుండును. ౬. మిగిలిన దక్షిణ నైరృతిమధ్యమునందు బూడిద యుండును. ౭ మిగిలిన నైరృతిదిశయందు శవస్థాపనముండును. ౮ మిగిలిన పశ్చిమమధ్యమున బొగ్గు లుండును. ౯ మిగిలిన పశ్చిమదిశయందు ధాన్యములుండును. ౧౦ మిగిలిన పశ్చిమవాయవ్యములమధ్య ధనముండును. ౧౧ మిగిలిన వాయువ్యదిశయందు పాషాణము లుండును. ౧౨ మిగిలిన వాయవ్యోత్తరములమధ్య దర్దురము లనుకప్ప లుండును. ౧౩ మిగిలిన నుత్తరదిశయందు పశువులయెముక లుండును. ౧౪ మిగిలిన యుత్తరేశాన్యమధ్యమందు కుక్కయెముకలుండును. ౧౫ మిగిలిన నీశాన్యదిశయందు భూతసంస్థాపన ముండును. ౧౬ మిగిలిన నీశాన్యప్రాగ్దిశలమధ్యమమున పిశాచసంస్థాపన ముండును. ఇందులకు ఫలములు ముందఱ చెప్పఁబడుచున్నవి.

గీ. రమణతో భూమి శోధించుసమయమునను
నిటికె తాఁబేలు జయ మగు నిసుము కప్ప
రాళ్లు గోశృంగములు గన్నఁ బ్రబలు భాగ్య
మనుచుఁ జెప్పిరి మునివర్యు లంబుజాక్షి! 10

భూమిని శోధించుసమయమున నిటిక తాబేలు కనిపించిన జయము కలుగును. ఇసుక, కప్పలు, రాళ్లు, ఆవుకొమ్ములు కనుపడిన భాగ్యవృద్ధియు శుభములు కలుగు నని మునులు చెప్పిరి.

క. కలహ మగుఁ బెంకు లుండిన
వెలిమిడి రోగంబు పొట్టు పేదఱికము బొ

గ్గులు మృతియుఁ గట్టె లగ్ని
జ్వలితము గులనాశనంబు శల్యము లభవా! 11

భూమిని శోధించునపుడు పెంకు లుండినఁ గలహము కలుగును. బూడిదెయుండిన రోగముగలుగును ఊమక పొట్టు కనబడిన దారిద్ర్యము కలుగును. బొగ్గులు కనుపడిన మృత్యువు. కట్టెలుండిన నగ్నిబాధకలుగును. శల్యము లుండిన కులనాశము కలుగును.

కారణాగమమునందలి శల్యపరీక్ష:—

గురుః కర్తార మన్వీక్ష్య వదే చ్ఛల్యం తు తద్గుణైః, య దంగస్పర్శనం కర్తు ర్వాస్తుదేహే త దంగకే శల్యం వినిర్దిశే త్ప్రాజ్ఞ శ్శిరసి స్పర్శనే యది, శిరస్థానే హేమశల్యం నాసికాస్పర్శనే యది. నాసికాయాం చైవ వాస్తో శ్చంద్రనం సప్త తాలకే, గళస్పర్శే హస్తిశల్యం స్యాత్ షట్తాళ ప్రమాణతః. ఊరుసంస్పర్శనే చైవ రంజితం పంచతాళకే, నాభిస్పర్శే చతుస్తాలం కాంస్యశల్యంవినిర్దిశేత్. గుహ్యసంస్పర్శనే తామ్రశల్యం చైవత్రితాలకే, జాన్వోశ్చ స్పర్శనేచైవ అయసాస్య ర్ధ స్తమాత్రతః. తథా గుల్ఫస్య సంస్పర్శే త్రపుశల్యం వినిర్దిశేత్, బాహ్వోశ్చ స్పర్శనేచైవ అజానాం శల్య ముద్ధరేత్. 12

౨౧ గృహములుకలవాస్తుమండలమున వాస్తుపురుషునియంగములను విభజించుకొని గృహయాజమాని యంగచేష్టచేత వాస్తుపురుషునియవయవములయందు శల్యములనెఱుఁగనగును. ఎట్లనినఃకర్తశిరమును స్పృశించి ప్రశ్నచేసిన వాస్తుపురుషుని శిరోభాగమునందు అష్టతాళప్రమాణమునందు బంగారపుకడ్డీ యుండును. (శిల్పశాస్త్రమున తాళప్రమాణ మనఁగా ౧౨ అంగుళములని చెప్పఁబడియున్నది) ముక్కు స్పృశించుచు ప్రశ్నయడిగిన వాస్తుపురుషుని నాసికాస్థానమున ౭ తాలములప్రమాణములోతున చందనపుకట్టె యుండును కంఠమును స్పృశించుచు ప్రశ్నయొనర్చినయెడల వాస్తుపురుషుని కంఠస్థానమున ౩ తాళముల ప్రమాణములోతున నేనుగుయెముక లుండును తొడ స్పృశించుచు ప్రశ్ననడిగిన వాస్తుపురుషుని యూరుభాగమునందు ౫ తాళములలోతున వెండి యుండును. బొడ్డును తాకుచు ప్రశ్నమొనరించిన వాస్తుపురుషుని నాభిస్థానమందు నాలుగుతాళములలోతున కంచుకడ్డియుండును. గుహ్యప్రదేశమును స్పృశించుచు ప్రశ్నమునడిగిన వాస్తుపురుషుని గుహ్యస్థానమునందు 3 తాళముల లోతున రాగిముక్క లుండును. మోకాలుతాకుచు ప్రశ్నించిన వాస్తుపురుషుని జానుస్థానమునందు హస్తప్రమాణమున యినుముండును. చీలమండలమును తాకుచు ప్రశ్నమును చేసిన వాస్తుపురుషుని గుల్ఫస్థానమునందు హస్తప్రమాణములోతున సీసపు ముక్కలుండును. బాహువులను తాకుచు ప్రశ్నముచేసిన వాస్తుపురుషుని బాహుప్రదేశమునందు హస్తప్రమాణములోతున పాముయెముక లుండును. పార్శ్వభాగమును

స్పృశించుచు ప్రశ్నమొనరించిన వాస్తుపురుషుని పార్శ్వభాగమున హస్తప్రమాణగర్తమునందు మేకయెముక లుండును. ఈ ప్రకారము శల్యములుండును. గనుక తీసివేయించి గృహానిర్మాణము చేయవలయును.

మఱియు సిద్ధాంతశేఖరమున నించుకభేదముండుటచే నా భేదమును వ్రాయుచున్నాఁడ:—

యజమానాంగచేష్టాభి ర్గురు శ్శల్యంవినిర్దిశేత్,
య దంగం సంస్పృశే త్కర్తా వాస్తో శ్శల్యం
తదంగకే. స్థిరం వినిశ్చితం భూయా త్తల్లక్షణ మ
థోచ్యతే,శిరసి స్పర్శనే వాస్తో ర్మస్తకే శల్య ము
ద్ధరేత్. అష్టతాలా దధశ్చాస్థి స్థితం తత్ర నసం
శయః,నాసికా స్పర్శనం కర్తు శ్చందనం సప్తతా
లకే. శ్రోత్రద్వయే చ సంస్పర్శే హేమ వా రజ
తం తు వా,ప్రవాళం వా తథా వాస్తో శ్శల్యం
తత్ర సముద్ధరేత్. గుహ్యాసంస్పర్శనే తామ్ర శ
ల్యం వాథ త్రితాలతః, ఊరు సంస్పర్శనే కర్తు
స్సార్ధహస్తాదధ స్థితం.ఊర్ధ్వవస్థి నిర్దిశే త్తత్రస్ప
ర్శనే జానుజంఘయోః, స్తనమాత్రా దధ స్తత్ర
నాపితస్య క్షురాదికమ్. పాదస్పర్శే తుపాదస్థం
షోడశాంగులకా దధః, గజదంతంమహాశల్య
ముద్ధరే ద్వాస్తుతత్త్వవిత్. అంసస్పర్శే త్వజా
శల్య మంసమాత్రాత్సముద్ధరేత్,హృత్పార్శ్వ

**తత్ర కర్తు స్సాస్య దంగారం త్రికరా దధః. కర
స్పర్శే కరే వాస్తోః ఖడ్గం చైకకరా దధః, ఏవం
శల్యం సముద్దిష్టం జ్ఞాత్వా తస్మా త్సముద్ధరేత్.
అనేకప్రాణిచేష్టాభిర్ధ్వనిభిర్లక్ష్యలక్షణైః, జ్ఞాత్వా
వాస్తుం చ నిశ్శల్యం గృహాదీనాంతుయత్నతః.**

ఇదియును పైనచెప్పినచొప్పున నే వాస్తుపురుషుని యవయ
వములయందు చూడవలయును. ఎట్లన:—కర్త శిరసును తాకు
చు వాస్తువేదిని ప్రశ్న యడిగినయెడల వాస్తుపురుషునిశిరస్థా
నమునరాతాళ ములలోతున శల్యములుండును. నాసికమును స్పృ
శించుచు ప్రశ్నమునడిగిన వాస్తుపురుషుని నాసికాప్రదేశమున
ఒకతాళములలోతున చందనపుకర్ర యుండును చెవులుతాకు
చు ప్రశ్నమును చేసిన వాస్తుపురుషుని కర్ణస్థానమున ఒకతాళ
ములలోతున బంగారము కాని, వెండి కాని, పగడము గాని
యుండును గుహ్యమును స్పృశించుచు ప్రశ్నమునడిగిన వాస్తు
పురుషునిగుహ్యస్థానమునందు రాగియుండును. తొడలనుతాకుచు
ప్రశ్ననడిగిన ౧౹ చేతెడులోతున తొడలయెముకలుండును.
మోకాలును దానిక్రిందిభాగముతాకుచు ప్రశ్ననడిగిన వాస్తుపు
రుషుని మోకాళ్లు పిక్కలు, యీస్థానములయందు ఎదురుబొ
మ్మలోతున మంగలకత్తులు మొదలైనవి యుండును. పాదము
లను తాకుచు ప్రశ్న నడిగిన వాస్తుపురుషునిపాదస్థానమున
౧౨ అంగుళములలోతున నేనుగుదంతము లుండును. భుజశిర
స్సులనుతాకుచు ప్రశ్నించిన వాస్తుపురుషుని భుజమూపురస్థాన
మునందు చేతెడులోతున మేంకయెముక లుండును. ప్రక్క

తాకుచు ప్రశ్నించిన వాస్తుపురుషుని పార్శ్వస్థానమునందు 3 చేతులలోతున బొగ్గులుండును. చేతులు తాకుచు ప్రశ్నడిగిన వాస్తుపురుషుని చేతులుండుతావున చేతెడులోతున కత్తియుండును. ఈప్రకార మాయాస్థానములయందు పరిశీలించి శల్యములను తీయవలయును.

మఱియు జంతువుల చేష్టలను, ధ్వనులను కనిపట్టి గ్రామనగరఖర్వట ఖేలాదులయందును, గృహాదులయందును, శల్యములను తీయవలయును. ముఖ్యముగా కర్త యేయంగమును దాకిన వాస్తుపురుషుని యాయంగమునందు నాయంగపరిమాణములోతున శల్యములుండును.

వాస్తుమండలవిధానము నగరవాస్తువునందు చెప్పఁబడియున్న ది చూడనగును.

గృహారంభేఽతికండూతి స్స్వామ్యంగే యత్ర జాయతే, శల్యం త్వపనయే త్తత్ర ప్రాసాదే భవనేఽపి చ. 14

ఇల్లు కట్టుటకు ప్రారంభింపఁగా గృహయజమానునికి యేయంగమునందు మిక్కిలి దురద కలుగునో, వాస్తుపురుషునియాయంగములయందు శల్యము లుండును.

ఆదిత్యాభిముఖం రౌతి శకునిః పరుషం యది, తుల్యకాలే స్పృశే దంగం గృహభర్తు ర్యదాత్మనః. వాస్త్వంగే తద్విజానీయా న్నరశల్యం భయప్రదమ్, శకునానంతరం యత్ర హస్త్యశ్వశ్వాపదం భవేత్.తదంగసంభవం విద్యా త్తత్ర

శల్యం విచక్షణః, ప్రసార్యమాణే సూత్రే తు
శ్వాగోమాయు ర్విలంఘనమ్. తత్ర శల్యం విజా
నీయా త్స్వరశబ్దేన భైరవే, య దీశానే తు ది
గ్భాగే మధురం రౌతి వాయసః. ధనం తత్ర
విజానీయా ద్భాగే వా య సధిష్ఠితే. 15

సూత్రమును పట్టునపుడు కాని స్తంభమును యెత్తునప్పుడు కాని పక్షి సూర్యుని కెదురుగనుండి యతికఠినముగ పలికిన నాసమయమునకు సరిగ కర్తయొక్క యే యంగ మదరునో, వాస్తుపురుషుని యా యంగమునందు మనుష్యశల్యము లుండును. మఱియు, ఏనుఁగు, గుఱ్ఱము, క్రూరమృగములు కూసిన నాసమయమునందు యజమానుని కేయంగమదరునో, వాస్తుపురుషుని యా యంగములయందు ఆయాశల్యము లుండును. సూత్రమును పట్టునపుడు అకస్మాత్తుగా నాసూత్రము నేజంతువులు దాటునో, ఏజంతువులు భయంకరముగ కూయునో, వానివానిశల్యము లాయాస్థలములయందుండును. మఱియు నీశాన్యభాగమున వాయసము మృదువుగా కూఁతకూసిన నాప్రదేశమునందు ధనముండును. ఏస్థలమున నుండి కూసిన నాస్థలమునందు ధన ముండును. ఈశల్యము మనిషిలోతుకు క్రిందనుండిన దోషము లేదని పెద్దలు చెప్పుదురు

'పురుషాధఃస్థితంశల్యంనగృహేదోషదంభవేత్,'

అనుటచే పురుషప్రమాణమునకు లోపలనే శల్యపరీక్ష చేయవలయును. పురుషప్రమాణమునకు శుల్బసూత్రము.—'పంచారత్ని ర్దశవితస్తి ర్వింశతిశతాంగుళః, పురుషః' అనుటచే ౧౨౦ అంగుళములు పురుషప్రమాణమని తెలియవలయును.

వాస్తుసంగ్రహమున.—

"యదిసూత్రంలంఘయేయుర్జంతవశ్శ్వనకాదయః,
యాందిశంయాంతితత్రాస్థిస్థితమిత్యుచ్యతేబుధైః."

సూత్రమును పట్టునపుడు కుక్క కోడి మొదలగు నేజంతువులు దాటి యేదిశకుఁ బోవునో, ఆదిశయందు వానివానియెముక లుండును.

మానససారమున సనత్కుమారవాస్తువునను:—

"సూత్రప్రసారణే కాలే లంఘయేచ్ఛ్వా వృషః
ఖరః, నైరృత్యాంపశ్చిమేవాయాక్రమాచ్ఛల్యం
తదంగజమ్, మార్జాలో లంఘ్యతే సూత్ర మా
గ్నేయాం తు వినిర్దిశేత్, మాహిషీ లంఘ్యతే
సూత్ర ముత్తరే చాస్థి నిర్దిశేత్. విలంఘితే మను
ష్యస్తు విద్యాత్క్షేత్రస్య మధ్యమే, యే జంతవో
విలంఘ్యంతే తేషాం శల్యాని నిర్దిశేత్." 13

గృహమునకు సూత్రమును పట్టునపుడు ఆసూత్రమును కుక్కదాఁటినయెడల నిరృతిదిశయందును, పశువులు దాటిన పశ్చిమమునందును, గాడిద దాటిన వాయవ్యమునందును, పిల్లి దాటిన నాగ్నేయమునందును, బఱ్ఱె పసరము దాఁటినయెడల నుత్తరమునను, మనుష్యుఁడు దాఁటినట్లైన గృహమధ్యమునందును, నాయాశల్యము లుండును. మఱియుఁ గొన్నివస్తువులయందు యేజంతువులు దాఁటి యేదిక్కునకు పోయిన ఆదిక్కులయం దాయాశల్యములుండు నని యెఱుంగవలయును.

"రోగప్రాప్తిః పాదశల్యం గమనం జానుశల్యకమ్, ఊరుశల్యం ఋణం చైవ కష్టం స్యాత్పృష్ఠశల్యకమ్. విద్వేషం జాఘనం శల్యం స్త్రీనాశం గుహ్యశల్యకమ్, బంధనం బాహుశల్యేన శిరో౽స్థి మరణం ధ్రువమ్." 19

అనివేశనమునందు పాదశల్యము లుండిన రోగములు గలుగును. మోకాళ్ళయొముక లుండినఁ బరస్థలప్రయాణమును, తొడయొముక లుండిన ఋణబాధయును, వీపెముక లుండిన కష్టములును, నడుముయొముక లుండిన శత్రుద్వేషమును, గుహ్యస్థానమునందలిశల్యము లుండిన స్త్రీనాశమును, బాహువులయొముక లుండిన బంధనప్రాప్తియు, తలయొముక లుండిన మరణమును కలుగి చేయును.

మహాకపిలపాంచరాత్రమూలమున:—

"ప్రాసాదారంభకాలే చ గృహాదౌ చ విశేషతః, శల్యోద్ధారస్తు కర్తవ్యో యదీచ్ఛేచ్ఛుభమాత్మనః. ప్రాసాదారంభకాలే తు యదంగం స్పృశ్యతే పుమాన్, వాస్తుదేహే దృఢం తత్ర శల్యం విద్యా ద్విచక్షణః. కండూయతి శిరః పుంసి శిరో శల్యం సముద్ధరేత్, శల్యం తత్రాస్థి విజ్ఞేయం ఖన్యమానే కరత్రయే. అగ్నిదాహశ్చ చరణో ధనహానిశ్చ జాయతే, యత్నేనోత్పాటయేచ్ఛల్యం యదీచ్ఛేచ్ఛుభమాత్మనః. బాహౌ

కండూయమానే తు నిర్దిశే ల్లోహశృంఖలమ్,
హ స్తద్వయేన సంతిష్ఠే ల్లక్షణం గదితం తవ.
స్వామినో మరణం విద్యా ద్విదేశగమనం తథా,
ఊరౌకండూయమానే తు కాంస్యశల్యం వినిర్ది
శేత్. హ స్తైనై కేన సంతిష్ఠే ల్లక్షణంగదితం తవ,
అసతీ చ భవే ద్భార్యా యశోహానిశ్చ జాయతే.
హ స్తేకండూయమానే తు కంకాళంచ వినిర్ది
శేత్,త్రిహ స్తేన చ సంతిష్ఠే త్ఖన్యమానేన చా
న్యథా అగ్నిదాహ శ్చ రోగం చ తచ్ఛ్రైష్ఠ్యం మర
ణంభ వేత్,పృష్ఠే కండూయమానే తు బాహు
శల్యం వినిర్దిశేత్. సార్థహ స్తేన సంతిష్ఠే న్నాత్ర
కార్యా విచారణా. స్వామినాశో భవే త్తత్ర
భార్యా వా జాయతే సతీ, పాదే కండూయ
మానే తు హ స్తశల్యం వినిర్దిశేత్. సార్థహ స్తే
న సంతిష్ఠే ల్లక్షణం గదితం తవ, గోనాశో రాజ
దండ శ్చ సస్యహాని శ్చ జాయతే కుక్షౌ కండూ
యమానే తు పాషాణం తత్ర నిర్దిశేత్, హ స్త
ద్వితయమానేన లక్షణం గదితం తవ. భుజంగ
దంశ స్తత్ర స్యా త్తస్మా చ్ఛంకుం సముద్ధరేత్,
కర్ణౌ కండూయమానే తు భస్మ తత్ర వినిర్ది
శేత్. హ స్తద్వయేన సంతిష్ఠే ల్లక్షణం గదితం
తవ, అగ్నిదాహో మనస్తాపః క్లేశదుఃఖభయాని

చ. కరో త్త్యేవంవిధం కర్మ తస్మాత్త ద్వైవ సముద్ధరేత్, గోశృంగంపీతమండూకశ్శంఖశ్శుక్తి శ్చకచ్ఛపః. కంబుకశ్చ ప్రశస్తాస్యుర్యా శ్చాన్యారత్నజాతయః, అంగారం వైతుషం కేశమస్థిశల్యం విచారయేత్." 20

దేవాలయములు గ్రామములు మొదలగునవి ప్రారంభించునప్పుడు వాస్తుమండలము నేర్పరచుకొని మండలరీతిగా వాస్తుపురుషుని యంగములను తెలిసి శల్యములను తీసివేసి గృహములను కట్టినట్లైన యజమానునికి సకలసుఖములు కలుగును. కనుక శల్యములను తీయునట్టిక్రమము చెప్పెదను గృహారంభసమయమునను యజమానుని దేయంగము స్పృశించునో, వాస్తుపురుషుని ఆయంగమునందు దృఢముగా నా యెముక లుండునని తెలియవలయును. యజమానునిశిరమున దురదకలిగినయెడల వాస్తుపురుషునిశిరస్థానమునందు 3 హస్తములలోతున నెముకలుండును. దానివలన యజమానునికి అగ్నిభయమును ధనహానియు కలుగును. తనబాహుస్థానమున గురద కలిగినయెడల ౨ హస్తములలోతున నొకయినుపగోలు నుండును. దానివలన మతియొకదేశమునకు ప్రయాణమును మరణమును కలుగును. హఠాత్తుగా తొడలయందు దురద కలిగినయెడల వాస్తుపురుషునియూరుస్థానమునందు ౧హస్తప్రమాణములోతున కం చుండును. అందువలన భార్య జారిణియగును. మతియు కీర్తియును నశించును. అరచేతియందు దురద పుట్టినట్లైన వాస్తుపురుషునియరచేతులలోతున 3 హస్తములలో

తునప్రక్క టెముక లుండును. అందువలన నగ్నిభయమును, మ
రణమును, రోగములును కలుగును. వీపున దురద పుట్టిన హస్త
ప్రమాణగర్తమునందు చేతియెముక లుండును. అందువలన ధనము
నాశనమును భార్య వ్యభిచారిణియు నగును. పాదములయందు
దురద కలిగినట్లైన ౧౪ హస్తప్రమాణము గర్తమునందు హస్త
శల్యము లుండును. అందువలన పశునాశనము, రాజదండము
సస్యనాశనము కలుగును. కడుపుభాగమున దురద కలిగినయెడ
౮ హస్తములలోతున రాళ్లుండును అందువలన సర్పము కలు
గును. చెవులందు దురద కలిగిన ౨ హస్తములలోతున బూడిద
యుండును. అందువలన నగ్నిభయము, మనస్తాపము, దుఃఖము,
భయము కలుగును కనుక గృహములను కట్టునపుడే పరీక్షించి
శల్యములను తీసి గృహములను కట్టిన శుభములు కలుగును. మఱి
యు భూశోధనముచేయునపుడు గోశృంగములు, పచ్చనికప్పలు,
శంఖములు, మత్స్యపుచిప్పలు, తాబేలు, పెద్దశంఖములు దొర
కినయెడల శుభములు కలుగును. మఱియు రత్నములు మొదల
యినవి లభించిన విశేషముగా ధనము మొదలగునవి కలిగి సుఖిం
తురు. బొగ్గులు, ఊముక, వెండ్రుకలు, ఎముకలు మొదలయినవి
దోషమును కలుగచేయునవి యగుటవలన వానిని తీసివేసి గృహ
నిర్మాణము చేసిన శుభములు కలుగును.

విచారింపక గృహములను కట్టినపిదప నాగృహములయందు
సంభవించెడునీతిబాధలచేత నాయాప్రదేశములయందు ముందు
చెప్పబోవునవి యుండునని తెలియువిధానమునుచెప్పుచున్నాను.

సీ॥ భూశోధనము లేక పూని గృహంబులు
గట్టియుండినఁ జెందునట్టి ఫలముఁ
దెలిపెదఁ బశువులు గలిగియుండియు నిండెఁ
బాఁడి లేకుండిన బాలశల్య
ములు తూర్పుదెస నుండు నిలపతు లేప్రొద్దు
నాగ్రహంబును జేయ నశ్వశల్య
మాగ్నేయమున నుండు నహరహంబును జ్వర
తాపము ల్గలిగిన దంతిశల్య
ములు నుండు దక్షిణమ్మున ఋణమ్ముల చేత
నుడివడియుండిన సూకరమ్ము
శల్యము లుండు రాక్షసుదిక్కునను నప
మృత్యుదోషంబులు మించెనేని
వృషభశల్యము లుండు వేగ పశ్చిమమున
గ్రామంబులోఁ బ్రజ ల్కలహ మంది
యూరు వెళ్లు మటంచుఁ బోరిన గార్దభ
శల్యము ల్వాయతస్థలము నుండు
నర్థనాశనము ద్రవ్యము గల్గినను మేష
శల్యము లుండు వైశ్రవణదిశను
పొరుగు లెప్పుడుఁజాలఁ బోరుచు నుండిన
నీశాన్యమునఁ గుక్క యెముక లుండు
నింటిలోఁ గలహంబు లేప్రొద్దుఁ గలిగిన
నట్టింటనుండును నరునిశిరము

తే. ఇది విచారింపవలసిన నిట్టిచోట్ల
నాఱు జేనలపొడవున నంతలోఁతు
త్రవ్వి యవి దీసివేయఁ గర్తకు లభించు
నాయురారోగ్యభాగ్యము లంబుజాక్షి. 21

పశువులు గలిగియు పాలనివ్వనియెడల గృహమునందు తూర్పుభాగమున బాలురశల్యము లుండునని తెలియవలయును. ప్రభువు లెప్పుడు గృహయజమానుని కోపించుచున్నయెడల గృహాగ్నేయమునందు గుఱ్ఱపుటెముక లుండును. ప్రతిదినమునందును ఇంటిలో జ్వరబాధ లెక్కువగా నుండినచో నైన గృహదక్షిణభాగమునం దేనుఁగుటెముకలుండును ఎల్లపుడును ఋణముచే బాధనొందుచుండిన గృహము నైరృతిభాగమునందు పందిటెముకలుండును ఇంటిలో నపమృత్యుదోషములు కలుగుచుండిన గృహము పడమటివైపున నెద్దుటెముకలుండును. ద్రవ్యము కలిగియు నాశము నొందుచుండిన గృహమున నుత్తరమున మేకశల్యములుండును. ఇరుగుపొరుగువారితోఁ బోరు కలుగుచుండినగృహమున నీశాన్యమునందు కుక్కటెముకలుండును ఇంటిలో కలహములుగలుగుచుండిన గృహమధ్యమునందు తలపుఱ్ఱె యుండును వీనినితీయునెడల ఉజానలవెడలుపుగల ప్రదేశమునం దంతలోతు త్రవ్వి శల్యములను దీయించి వేసిన కర్తకు శుభములు కలుగును.

శల్యములను తీయుటకు మఱియొకవిధము.

భూమిని శోధించక గృహములు కట్టి అందువల్ల కష్టములను పడువారు శిల్పిదగ్గర చేరి ప్రశ్న నడుగఁగా వాస్తువేత్త

౯ యిండ్లుగఁ జక్రమును వ్రాసి యందు ప్రాగాదిగా౧,౬౩,౮,

| ౬ శు | ౮ ౧ | రా ౮ |
|---|---|---|
| శ ౭ | కు ౫ | కే ౩ |
| చం ౨ | బు ౪ | బృ ౬ |

౯, ౨, ౭, ౪; వ్రాసి నడిమిగడియందు ౫ సంఖ్యను పెట్టి ఆయా గదులయందు సంఖ్య ప్రకారముల గ్రహములను వ్రాసి గంధపుష్పాక్షతల చేతఁ బూజించి ప్రశ్నవడుగ వచ్చినవానిచేతఁ దనయిష్టమువచ్చిన గదిని తాకుమనిచెప్పి యాగ్రహమును తెలిసి పృచ్ఛకుని యింటికి పోయి ఆయింటియొక్క పూర్వపశ్చిమసంఖ్యను దక్షిణోత్తరసంఖ్యతో గుణించి ౯చేత భాగించి మిగిలినసంఖ్యను గుర్తెఱిఁగి ప్రథమమునం దేగ్రహస్థానమును స్పృశించుచున్నాఁడో ఆగ్రహముమీద చెప్పఁబడు క్షేత్రమునుభాగించి ముందునిలిచినశేషము యేసంఖ్యకలదో, ఆసంఖ్యాభాగమునందు రెండుగజములవెడల్పున గోతినిత్రవ్వి శల్యమునుతీయవలయును.

౧ సూర్యునిమీద ఫలము. తూర్పునమోకాలిలోతున శల్యముకాని రాగిచెన్నముకలుక్క కాని యుండును. మఱియు నాగ్నేయమున పాడుపాతరయుండును. ౨స్పృశించినయెడల చంద్రునిమీఁద ఫలము దక్షిణదిశయందు పాడుపాతర యుండును. ౩తాకిన యెడల నంగారకునిఫలము. దక్షిణమునందు స్త్రీశల్యములును, నైరృతిదిశయందు పాడుపాతరయు నుండును. ౪ సంఖ్యను తాకిన బుధునిఫలము నైరృతిదిశయందు మనుజశల్యములును, దానికి పశ్చిమమున పాడుపాతరయు నుండును. ౫స్పృశించిన గురునిఫలము. పశ్చిమమున పిల్లియెముకలును, దానికి పడ

మట పాడుపాతరయు నుండును. ౭ తాకిన శుక్రునిఫలము. వాయ
వ్యమునందు జంతువుల శల్యములును, దానివెంటనే యుత్తరము
నందు పాడుపాతరయు నుండును. ౭ ముట్టిన శనిఫలము. ఉత్తర
మున నావుశల్యములును, దానికినీశాన్యదిశయందు పాడుపాతర
యు నుండును. ౮ ముట్టిన రాహుఫలము. ఈశాన్యదిశయందు
బూడిద, పెంకులు, దానిమధ్యప్రదేశమందు సూకరశల్యములు
నుండును. దానికితూర్పు పాడుపాతరయు నుండును. ౯ తాకిన
కేతువుఫలము. మండిగముక్రింద పాడుపాతరయు, గృహమధ్య
మునందు మనుజశల్యములు నుండును ఈక్రమమును దెలిసి ఫల
ములఁజెప్పినట్టయినఁ బ్రత్యక్షనిదర్శనముగా నుండును.

మఱియు పృచ్ఛకుని వాక్యముమీద ఫలము చెప్పుట.

అ క చ ట త ప య శ వర్గములకు వరుసఁగా గరుడుఁడు,
పిల్లి, సింహము, కుక్క, పాము, యెలుక, ఏనుఁగు, కుందేలు,
యివిరాదియును నాయావర్గముల కధిపతు లనియెఱుఁగ వలయు
ను. మఱియు అవర్గువుకు మేషము, కవర్గువుకు మిథునము, చవర్గువు
కు కర్కాటకము, ట వర్గువుకు సింహము, తవర్గమునకు కన్య,
పవర్గమునకు తుల, యవర్గమునకు మకరము, శవర్గమునకు మీనము
ఇవి వర్గరాసులని యెఱుఁగవలయును.

మేషవృషభములకు తూర్పు, మిథునమున కాగ్నేయము, క
ర్కాటకమునకు దక్షిణము, సింహకన్యలకు నైరృతిదిక్కు, తులా
వృశ్చికములకు పశ్చిమము, ధనుస్సునకు వాయవ్యము, మకరకుం
భముల కుత్తరము, మీనమున కీశాన్యము. ఇవి రాశిదిశలు కనుక

నాయాప్రశ్నాక్షరము లేవర్గమునం దుండునో యావర్గమున కధిపతియగు జంతువులశల్యము లాయారాశిదిశలయం దుండును.

ఏగృహమున శల్యములు తీయవలయునో ఆయింటిని పూర్వాపశ్చిమములు ఉత్తరదక్షిణములు కొలిచి యామొత్తములు కలిపి

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ |
| ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ |
| ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ |
| ౧౬ | ౧౭ | ౧౮ | ౧౯ | ౨౦ |
| ౨౧ | ౨౨ | ౨౩ | ౨౪ | ౨౫ |

౨౫ సంఖ్యచేతభాగింపఁగా మిగిలినశేషసంఖ్యకు ఫలము. ౧ మిగిలిన పెంకులు, ౨ మిగిలిన రాళ్లు, ౩ మిగిలిన ఇనుము, ౪ మిగిలిన మనుష్యుని తలపుఱ్ఱె ౫ పందిశల్యము ౬ కుమ్మరామపుగుంట, ౭ గుఱ్ఱపుశల్యము. ౮ ఎద్దుకొమ్ము, ౯ పిశాచగ్రస్తునిశవము, ౧౦ బొగ్గులు లేక యిటికె. ౧౧ శిశువులతలపుఱ్ఱె, ౧౨ వరాహశల్యము, ౧౩ మార్జాలశల్యము. ౧౪ గాడిద బొమికలు లేక కుక్కయెముక, ౧౫ ఎద్దుఎముకలు, ౧౬ విగ్రహము, ౧౭ జింకయెముకలు, ౧౮ ఓలు, ౧౯ దున్నపోతుశల్యము, ౨౦ ఖరశల్యము, ౨౧ దేవతావిగ్రహము, ౨౨ ధనము, ౨౩ లింగము, ౨౪ పాత్రము, ౨౫ శూన్యము ఇవి హస్తవిభాగము చేత నెఱుఁగవలయును.

మఱియు మనువాస్తువునందు:—

"అవర్గోచ్చారణే పూర్వం నరపాదాసి కీర్తితం,
రాజరోగభయం చైవ జఘనస్య ప్రమాణతః.

కవర్గే చాగ్నిదిగ్భాగే నరశల్యం ప్రకీర్తితమ్,
ఋణం చ వ్యాధిపీడా చ కట్యధస్తేల ఏవ వా
చవర్గే దక్షిణస్థానే బాలశల్యం ప్రకీర్తితమ్,
అగ్నిభీతి ర్మహాపీడా పురుషస్య ప్రమాణతః.
టవర్గే నైర్ఋతే భాగే మార్జాలాస్థిప్రకీర్తితమ్,
గృహే బాలప్రపీడాచ అంగుళాష్టకమానతః.
తవర్గే పశ్చిమే భాగే గోవృషాస్థిని వై విదుః,
పంచతాలప్రమాణే తు పశుబాధా ప్రజాయతే,
పవర్గే వాయుదిగ్భాగే కురంగఖరకీకసే,
భ్రాతృపుత్రవినాశ స్స్యాత్కటిమాత్రధరాతలే.
యవర్గే చోత్తరే భాగే పశుకీకస మేవ చ,
భార్యాహాని స్సదా దుఃఖం సక్థిమానేన తత్స్మృతమ్. శవర్గేచ స తీశాన్యే వరాహాగజకీకసే,
పురుషస్యప్రమాణేన దారిద్ర్యం పుత్రనాశనమ్.
హాకారం గృహమధ్యేతు కపాలం భస్మచైవవా,
కీకసం వా భవే త్తత్ర పురుషస్య ప్రమాణతః.

మఱియు పృచ్ఛకుఁడు అవర్గము నుచ్చరించి పలికిన తూర్పు దిశయందు జఘనప్రమాణములోతున మనుజుని పాదశల్యము లుండును. అందువలన రాజ (క్షయ) రోగము కలుగును. ఆప్ర దేశమున నుండుశల్యములను తీసి వేసిన రాజయక్ష్మ నివర్తించును.

కవర్గము నుచ్చరించి ప్రశ్నచేసినయెడల నాగ్నేయదిశయందు మనుజునిశల్యము తొడలలోతున నుండును. అందువలన యజమానునికి ఋణబాధయు వ్యాధిపీడయు కలుగును శల్యములనుతీసి వేసిన ఋణబాధయు వ్యాధిపీడయు తొలగును చవర్గోచ్చారణతో ప్రశ్నచేసిన నగ్నిభయమును, వ్యాధులను కలుగఁజేయు శిశువులశల్యములు పురుషప్రమాణమున నుండును వానిని తీయించిన యజమానునికి సుఖము గలుగును. టవర్గోచ్చారణముతో ప్రశ్నచేసిన నైరృతిశయందు ౮ అంగుళములలోతున శిశువులకు పీడచేయునట్టి పిల్లియెముక లుండును. తవర్గమున ప్రశ్నచేసిన పశ్చిమదిశయందు పశువులకు బాధ కలుగచేయుగోవులయొక్కయు, యెద్దులయొక్కయు శల్యములు ౫౦ళములలోతున నుండును. పవర్గోచ్చారణ ప్రశ్నచేసిన వాయువ్యదిశయందు కటి ప్రమాణములోతున అన్నదమ్ములు పుత్రులు మొదలగు వారిని నాశముచేయుజింకశల్యములు గాడిదశల్యములు నుండును. యవర్గోచ్చారణ ప్రశ్నచేసిన నుత్తరదిశయందు భార్యానాశము దుఃఖము కలుగచేయుపశుశల్యములు తొడలలోతున నుండును. శవర్గాక్షరప్రశ్నచేసిన నీశాన్యభాగమునందు దారిద్ర్యమును, పుత్రనాశనమును కలుగఁజేయును. పందిశల్యములు ఏనుగుశల్యములు పురుషప్రమాణమున నుండును. హవర్ణము నుచ్చరించి ప్రశ్నచేసిన గృహమధ్యమునందు పురుషప్రమాణమున రోగబాధను చేయుతలపుర్రెకాని బూడిద కాని యెముకలు గాని యుండును. ఙఞణనమ అక్షరముల ప్రశ్నచేసిన నేమియు నుండదని యభిప్రాయము.

విశ్వకర్మచేఁ జెప్పఁబడిన మఱియొకశల్యవాస్తువు:—

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అ | భ | కృ | రో | మృ | వి | అనూ |
| శే | ఆశ్రే | పు | పున | ఆర్ద్ర | స్వా | జ్యే |
| ఉభా | మ | పుబ్బ | ఉత్త | హ | చి | మూ |
| పూభా | శ | ధ | శ్ర | అభి | ఉభా | పూషా |

ఆయామ రేఖా స్సృష్ట్వా చ తిర్యగ్రేఖాసుపంచ చ,
ఏవం కృతే భవేయు శ్చ అష్టావింశత్పదాని చ.
ఆగ్నేయసంక్తౌ ద్వయం హిత్వా కృత్తికాదిత్రయం
న్యసేత్, తదధో రౌద్రభం న్యస్య తతస్సౌమ్యే
తు పదత్రయే. పునర్వస్వాది త్రితయం న్యసే
త్తత్ర చ పూర్వవత్,తత్పశ్చిమాదికోష్ఠేషు పై
తృకారాదిపంచకమ్ తతఃపూర్వకోష్ఠ ద్వితయే
వాయుభం చ ద్విదైవతమ్,ప్రదక్షిణక్రమే ణై
వ భరణ్యంతం న్యసేత్తతః, యస్మిన్భే తిష్ఠతి
శశీ తత్రశల్యం వినిర్దిశేత్. 23

పూర్వపశ్చిమములు ౮ రేఖలు వ్రాసి దక్షిణోత్తరములు ౫ రేఖలు వ్రాసినట్లైన ౨౮ కోష్ఠములగును అందు మొదటి రెండుగ దులను విడిచి మూఁడవగది మొదలు కృత్తికాదిమూఁడు నక్షత్రము

లను వ్రాసి దానిక్రిందిగళ్లయందు దక్షిణము నుండి యుత్తర మునకు ఆర్ద్రి మొదలు నాల్గునక్షత్రములను వ్రాయవలయును. ఆశ్రేషకు క్రిందిపంక్తియందు మఘమొద లైదునక్షత్రములను దక్షిణమునకువ్రాసి దానికి తూర్పు రెండుగడులయందు స్వాతివి శాఖలను వ్రాసి దానికిదక్షిణమందు ప్రదక్షిణక్రమముగా ననూ రాధ మొదలు భరణివఱకు లిఖించవలయును. ఈచక్రమునందు చంద్రుఁడేనక్షత్రమునం దుండిన ఆప్రదేశమునందు శల్యము లుండునని తెలియవలయును.

ఇట్లు వాస్తుసర్వస్వమునందు శల్యపరీక్షయను
మొదటిప్రకరణము.

---

# వాస్తుసర్వస్వము.

## జలవాస్తువు.

వాస్తుశాస్త్రాణిసర్వాణి సమాలోచ్య ప్రయత్నతః,
జలవాస్తు ప్రవక్ష్యామి వాస్తుసర్వస్వసంగ్రహే.

సకలభువనరక్షణదక్షుం డగుసర్వేశ్వరునిచేత సృజింపఁబడి నచరాచరప్రపంచమునందు పశుపక్షిమానవాది ప్రాణిసమూహ మునకును, తరుగుల్మలతాదులకును, ప్రాణాధార మగుజలము, గంగాగోదావర్యాదినదులుగను, కృత్రిమము లగువాపీకూపతటా కాదులుగను నున్నది. ఆయుదకము కొన్నిప్రదేశములయందు

లోతునను, కొన్నిచోట్ల సమీపమునను దొరకుచున్నది. మఱి కొన్నిచోట్ల నుదకము లభింపక యుండును. అట్టిప్రదేశముల యందు జలమును కనిపట్టుటకు లోకోపకారపారీణులగు బ్రహ్మ, మను, గార్గ్య, త్వష్ట్ర, వరాహమిహిర, విశ్వకర్మ మొదలగు మహర్షులు అనేక జలవాస్తుగ్రంథములను రచియించియుం డిరి. ఆగ్రంథములయందు ఒకటికన్న నొక్కటి యనేక విషయ ములను జెప్పుచుండుటచేత వాని నన్నిటిని చూచుట కెట్టిమహా నీయునికైనను దురవగాహము కనుక వాని నన్నిటిని సంగ్రహిం చి వాస్తుసర్వస్వ మనునామము నేర్పరచి యందు జలవాస్తుప్రక రణమును చెప్పుచున్నాఁడను

శిల్పాచార్యమతము:—

> కూపాద్యారంభకాలే తు కర్తా యద్దిఙ్ముఖో భ
> వేత్, తద్దిక్ఫలం వదే త్సర్వం వాస్తుశాస్త్రవిశా
> రదః. సంపృచ్ఛే ద్యది దైవజ్ఞం కర్తా నైరృత్యస
> మ్ముఖః, తత్స్థలే జలహీనం స్యా త్తథా చాగ్నే
> యసమ్ముఖః. తదాభ్యామా వనలం జ్ఞేయం తథా
> వాయవ్యసమ్ముఖః, తత్స్థానే మృతి రేవ స్యా
> చ్ఛేషదిక్షు జలం స్మృతమ్ 2

కూపవాపీతటాకాదినిర్మాణకాలమునందు యజమాని యేది క్కునకభిముఖుఁడై ప్రశ్నము చేయునో ఆదిక్కునకు ఫలము చెప్పవలయును. ఎట్లనిన: నిరృతిదిక్కును చూచుచు ప్రశ్నము చేసిన నాదిక్కున జలముండదనియు, అగ్నిదిశను చూచుచు

ప్రశ్న చేసిన మరణము కలుగుననియు, తక్కిన దిశలయందు సమృద్ధికలయుదక ముండు ననియు చెప్పవలయును.

జలార్గళశాస్త్రము:—

ద్వారహీనో భవేత్కూపో ద్వారే త్వైకేన వాపికా, నైకద్వారా పుష్కరిణీ దీర్ఘాకారా తు దీర్ఘికా, కుల్యా విధూతతోయ శ్చ తటాకః పరికీర్తితః. ౧

ద్వారము లేనిది కూపమనియు, ఒకద్వారము కలది వాపిక యనియు, నాలుగుద్వారములు కలది పుష్కరిణి యనియు, పొడవుగనుండునది దీర్ఘిక యనియు, కాలువలయుదక ప్రవాహము చేత నిండునది తటాక మనియు చెప్పఁబడును.

కాశ్యపమతము:—

సంక్రాన్తితారాతిథివారసంఖ్యా సప్తాహతా నందవిభాజితా స్యాత్, క్షారోదకం నిర్జలమశ్మసంఘమల్పాంబు మాధుర్యజలం క్రమాత్స్యాత్. స్వాదూదకం చాల్పతోయంశిలాసంఘమితిస్మృతమ్, పృచ్ఛకస్య ప్రశ్నకాలే వదేద్దైవజ్ఞసత్తమః.

పృచ్ఛకుఁడు దైవజ్ఞునియొద్దకువచ్చి మంచియుదకము దొరకునా యని ప్రశ్నచేయఁగా నాకాలమునకు గలసంక్రమణములసంఖ్యయును, నక్షత్రతిథివారములసంఖ్యయును, నొకటిగాఁ జేర్చి ౭ తో పెంచి ౯చేత భాగించగా నిలిచినమొత్తమొకటిమిగిలిన క్షారోదకము గలుగును. ౨ మిగిలిన యుదక ముండ నేరదు.

౩ మిగిలిన రాళ్లుండును. ౪ మిగిలిన స్వల్పోదకము గలుగును. ౫ మిగిలిన మంచియుదకము గలుగును. ౬ మిగిలిన మధురోదకము గలుగును. ౭ మిగిలిన నల్పోదకము గలుగును ౮ మిగిలిన రాళ్లుండును అని చెప్పవలయును.

వరాహమిహిరునిమతము:—

శుభ్రవస్త్రోపమా క్షౌద్రతుల్యవర్ణశిలాధరా,
అక్షయంకురుతేతోయంసర్వప్రాణిసుఖావహమ్.

తెల్లనివస్త్రమువంటిరంగును, తేనెవర్ణముగలరాళ్లు, ఏప్రదేశమున నుండునో, అచ్చట సకలప్రాణులకు సుఖము నిచ్చెడుజలసమృద్ధి కలిగియుండును. మఱియు వైడూర్యములు పెసలు తుమ్మెద యీవర్ణములు కలరాళ్లసమీపమునందు సమృద్ధికల జలమును, మఱియు ముత్యములు బంగారము వెండి హరిదళము వీని ఛాయలుగలరాళ్లుండుచోట సంపూర్ణజల ముండును. మఱియు మద్దిచెట్టు, బిల్వవృక్షము, నెల్లిచెట్టు, తిప్పతీగ, పొన్నగంటి యివికలిగినచోట్ల జలముండును. మఱియు సున్నపురాతితో చేరిన నల్లమృత్తికగాని, ఎఱుపుమృత్తికగాని, కుశ, దర్భకలచోట్ల జలముండును. ఖర్జూరము, నేలతామర, తామర, కానుగ మొదలగునవి యుండు ప్రదేశములయందును, పచ్చిక కల ప్రదేశములయందును జల ముండును. సున్నపురాళ్లతో గూడి ఎఱుపగు భూమియందు చేదునీళ్లుండును. తీగలు ఆకులు దట్టముగాను, పచ్చగాను, ఉండు ప్రదేశమందు జలముండును. కపివర్ణము.కల భూమియందుప్పునీళ్లుదొరకును. తెల్లటినేలయందు కొంచెముప్పు

గల నీళ్లుపడును. నలుపుభూమియందు మధురోదక ముండును. కొండమీద కొండయుండిన నొకమట్టున జల ముండును.

బ్రహ్మవాస్తువునందు:—

స్వేష్టప్రదేశే ఖనయే ద్ద్వాదశాంగుళమానతః,
చతురశ్రం చతుర్దిక్షు గంధపుష్పాదిభి ర్యజేత్.
నిశాదౌ పూరయే త్తోయం ప్రాతఃకాలే పరీక్ష
యేత్, స్థితం చే దక్షయం తోయం పంకే చా
ల్పజలం స్మృతమ్. 6

జలమును కనిపట్టువిధము:—

బావి త్రవ్వనట్టిస్థలమును నిశ్చయించి యాప్రదేశమునందు ౧౨ అంగుళములలోతుగుంట చతురశ్రముగ త్రవ్వి సాయం సమయమునందు దానినిండ నీరును నింపించి గంధపుష్పాదుల చేత నలుదిశలయందు పూజించి తెల్లవారినపిదప నాగుంటను పరీక్షించగా నాగుంటయందు నీరుండిన నక్షయోదక ముండును. బురదగా నుండిన స్వల్పజల ముండునని యెఱుంగునది.

మయమతము:—

అష్టౌ చ త్రీణి చత్వారి ఏక పంచ నవైవ చ,
రసస ప్తకరశ్చైవ మయేన పరిభాషితమ్. 7

పృచ్ఛకుఁడు వాస్తువేదియొద్దకువచ్చి జలము దొరకుటకు ప్రశ్న నడుగఁగా వాస్తుశాస్త్రవేత్త నాగదుగల చక్రములును

| | | |
|---|---|---|
| ౮ | ౧ | ౬ |
| ౩ | ౫ | ౭ |
| ౪ | ౯ | ౨ |

వ్రాసి అందీశానోత్తరవాయుదిశల గదులయందు ౮, ౩, ౪, ఆగ్నేయ, దక్షిణ. నిరృతిదిశలయందు ౬, ౭, ౨ ప్రాగ్దిశ, మధ్యము పశ్చిమ గదులయందు ౧, ౫, ౯ యీసంఖ్యలను వ్రాసి గంధపుష్పాక్షతలచేత పూజఁజేసి పృచ్ఛకునిచే నొకసంఖ్యను స్పృశించునట్లు చేయించి యాయంకె స్థానమున కేగ్రహ మగునో దానిని దెలసి ఫలమును చెప్పవలయును మఱియు పృచ్ఛకుని ప్రశ్నకాలమునకు పాదచ్ఛాయలు వేసి అందు ౨౮ చేర్చి ౧౨చేత పెంచి ౯ చేత భాగించఁగా నిలిచినవానికి సూర్యాదిగ్రహఫలములను చెప్పవలయును. ౧మిగిలినను, సూర్యస్థానమును స్పృశించినను, మూఁడుపురుషులలోతున తూర్పు జలనాడి యుండును. అందు రెండు సర్పములను, వాని క్రింద నొకరాయియు, రెండుమట్టులలోతున జలము కనిపించి నాలుగుమట్టులలోతువఱకు జలము సంపూర్ణముగ నుండును. ౨ సంఖ్యకు ఫలము. మూడుపురుషులలోతున కొంచెము జలము కనిపించి నాలుగుమట్టులలో వాయవ్యమునజలనాడియుండును. ౩ సంఖ్యకు ఫలము. మనిషిప్రమాణమున రాయి కనిపించి రెండుమట్టునపర్యంతము మెత్తని మృదుభూమి దొరకును దాని క్రింద సన్నరాళ్లును వాటిక్రింద జలము సమృద్ధిగా దొరకును. ౪ సంఖ్యకు ఫలము. రెండుమట్లక్రింద జలము కనిపించి నాలుగుమట్లక్రింద నుత్తరము నుంచి వచ్చుజలనాడి యుండును. జలసమృద్ధియు కలిగియుండును. ౫ సంఖ్యకు ఫలము. నాలుగు

మట్లలోతున నీశాన్యమునుంచి వచ్చెడుజలనాడియు కలదు. జల సమృద్ధియు కలుగును. ౬ సంఖ్యకు ఫలము. మూఁడుపురుషుల ప్రమాణమున సన్నరాళ్లుండును. దానిక్రింద నాలుగుమట్లలో తున జల ముండును. ౭ సంఖ్యకు ఫలము. మలుపురాయి దొరికి పిమ్మట జలము దొరకును. ౮ సంఖ్యకు ఫలము. నల్లని శిల కను పడి స్వల్పజల ముండును.

మఱియు సారస్వతమతమునందు వృక్షలు, చెల్లు, కసవు, తీఁగెలు మొదలగునవి కలప్రదేశమునందు నేప్రకారము నాడు లుండునో? ఆప్రకారమే భూమిలోపల జలధారలుండును. తూర్పుమొద లీశాన్యమువఱకు నింద్రాదినామములు గల ౮ జల ధార లుండును. పాతాళము నుంచి పైకుబికి వచ్చెడు మహాశి రయను జలనాడియు కలదు ఇందులో నాలుగుదిశలనుండి వచ్చె డుజలనాడు లుత్తమములు. మూలలనుంచి వచ్చెడు జలనాడు లుత్తమములు కావని తెలియవలయును. అందులో పడమట నుంచి తూర్పుకు వచ్చుజలనాడు లత్యుత్తమములు.

నిర్జలప్రదేశమునందు చెట్లుమొదలగువాటిచేత జలము నె ఱుఁగువిధము:—

నేరేడుచెట్టుకు తూర్పుభాగమునందు పుట్టయున్నయెడల దానికి దక్షిణమునందు ఇద్దరుపురుషులలోతున మధుర మగునీ రును, పురుషార్ధప్రమాణమునం దొకమత్స్యమును, బూడిద వర్ణము గలరాళ్లును, కృష్ణవర్ణముగల మృత్తికయును, దానిక్రిం ద సంపూర్ణజల ముండును. మేడిచెట్టున్నయెడల దానికి పశ్చిమ

మునందు మూఁడుమూరలలో ౩౹ మట్టు ప్రమాణమునందు తెల్ల నిపాము నల్లనిశిలయును దానిక్రింద తూర్పునుండి ప్రవహించెడు మధురజలనాడియు నుండును. ప్రబ్బలిచెట్టుండినట్లైన దానికి పడమటిదిశయందు మూఁడుమూరల దూరమునం దర్థమట్టులో శ్వేతమండూకమును, పచ్చనిమృత్తికయును, దాని క్రింద నాయుధముచేత సాధ్యమైనశిలయును, దానిక్రింద సమృద్ధ మగుజలమును దొరకును మద్దిచెట్టుండినట్లైన దానికుత్తరమునందు పుట్టియుండినయెడల మద్దిచెట్టుకు పడమటిదిశయందు మూఁడుమూరల దూరమునందు ౩౹ మట్టు ప్రమాణమునందు బూడిదరంగుగల మృత్తికయును, దానిక్రింద కృష్ణవర్ణము గల మృత్తికయును, తెలుపుపసపురంగులు గలయిసుకయును, దాని క్రింద నిర్మల జలమును దొరకును.

ముత్తిపులగపుచెట్టును, రేణిచెట్టును నుండిన దానికి పడమటిదిశయందు ౩। మట్టులోతున జలముండును. పురుషప్రమాణమునందు విషములేని రెండుతలలపాము ఉండును. వావిలిచెట్టుకు పుట్ట చుట్టుకొనియుండిన దానికిదక్షిణమునందు మూఁడుమూరలదూరమునందు ౨। మట్టున మంచియుదకమును, అర్ధపురుషప్రమాణమునందు ఎఱ్ఱనిచేపయు, దానిక్రింద కపిలవర్ణముగల మృత్తికయును, దానిక్రింద తెల్లనిమృత్తికయు, దాని క్రింద నిసుకయును, దానిక్రింద సున్నపురాయియు, దాని క్రింద జలము నుండును. మేడిచెట్టు, మారేడుచెట్టు కూడియుండిన దానికి దక్షిణదిశయందు మూఁడుమూరలదూరమునందు మూఁడునిలువులలోతున నుదకమును, ౧౹ నిలువులోతున

కప్పయు నుండును. బ్రహ్మదండిచెట్టుండిన దానికిఁ దూర్పుదిశ యందు మూఁడుమూరలదూరమున 3 మట్లప్రమాణమున దక్షిణ మునుండి ప్రవహించెడియుదకధారయును దానిక్రింద నల్లని రంగుగల మన్నును, బూడిదరంగుగల మృత్తికయు, మేకవాసన గలచేపయును, దానిక్రింద నమృతతుల్య మగునుదక ముండును. జలరహితప్రదేశమునందు జిల్లేడుచెట్టుండిన దానికి వాయవ్యది శయందు రెండుమూరలదూరమునందు మూఁడునిలువులలోతున జలనాడియు నుండును. కానుగు చెట్టుండిన దానికి దక్షిణము నందు పుట్టయుండిన దానికి దక్షిణపుదిక్కునందు అర్ధమట్టులో తునఁ దాబేలును, దానిక్రింద తూర్పునుండి ప్రవహించెడు జలధారయు, దానిక్రింద యుత్తరమునుంచి ప్రవహించు జలధారయును, దానిక్రింద పచ్చనిపాషాణమును, దాని క్రింద సంపూర్ణ జలము నుండును. నిర్జలప్రదేశమునం దేవృక్షముక్రింద నైనను, కప్పయుండిన దానికి మూరెడుదూరమునందు ర్౹మట్టు లోతున జల ముండును. అం దొకనిలువులోతున ముంగిసయు, నల్లనిరంగుగలమన్నును, ఆకుపచ్చరంగుమన్నును, శ్వేతవర్ణము గలమన్నును, కప్పవన్నె గలశిలయును, దానిక్రింద సమృద్ధమగు నుదకము నుండును. ఇప్పచెట్టుండిన దాని కుత్తరమునఁ బుట్ట యుండిన దాని కుత్తరమునందు అయిదుమూరలదూరమునందు నాలుగు మట్టులలోతున తూర్పునుంచి ప్రవహించెడు జలధా రయుండును. ఒకనిలువులోతున పామును, ధూమ్రవర్ణముగల మృత్తికయును, నులవలరంగు గలరాయియు నుండును. తాటి చెట్టునకుగాని టెంకాయచెట్టునకుగాని పుట్ట యావరించియుం

డిన దానికి పశ్చిమమునం దారుమూరలదూరమున నాలుగుమట్ల లోతునందు దక్షిణమునుంచి వచ్చెడుజలధార యుండును. మఱి యు వెలంకాయచెట్టుకు దక్షిణమునందు పుట్టయుండినదాని కేడు మూరలదూరమున నైదుమట్టులలోతున సమృద్ధజలము కలిగి యుండును. ఒకనిలువులోతున నానావర్ణములు గల శల్యములు ను, నల్లనిరంగు గల మృత్తికయును, నాయుధసాధ్య మైనపా షాణమును, తెల్లనిమన్నును, దానిక్రింద పడమటినుంచి ప్రవ హించుజలధారయును, దానిక్రింద నుత్తరము నుంచి ప్రవహిం చెడు జలధారయు నుండును. మఱియుఁ బుట్ట లుండినయెడల వాటిసమీపముల జల ముండును. మారేడుచెట్టు, కానుగుచెట్టు, జీడిచెట్టు, మద్దిచెట్టు, చిట్టాముదపుచెట్టు వీటియందే చెట్టున కైనను పుట్టచుట్టుకొనియుండిన దానికుత్తరమున మూఁడుమూ రలదూరమునందు నాలుగున్నరనిలువులోతున సమృద్ధిగలజల ముండును. నీరు లేనినిర్జలప్రదేశమునందు నడుచునపుడు గంభీర మైనశబ్దము పుట్టినయెడల నచట౩౹పురుషప్రమాణమున నుత్తర మునుండి ప్రవహించెడుజలనాడి యుండును పెద్దమాను చెట్టు కొమ్మ లన్నియు సరిగా నుండి వాటిలో నొకకొమ్మ నేలకువంగి కాని, తెలుపువర్ణము కలిగికాని యుండిన దైన నచ్చట మూఁడు మట్టులలోతున జల ముండును. ఏవృక్షము నైనను వాటివాటి స్వభావము మారి, చిగుళ్లు, పువ్వులు, కాయలు మొదలగువాటి వర్ణములు భేదముగ నుండినయెడల దానికి తూర్పున మూఁడు మూరలదూరమున నాలుగుమట్టులలోతున జల ముండును. దాని

యందు తెల్లనిమన్నును రాళ్లును నుండును. కంటకాదివృక్షము, రామములకవృక్షము ఇవి ముండ్లు లేక తెల్లనిపూవులు పూచిన దాని క్రిందమూఁడున్నరమట్లులోతున నుదకముండును. రెండుతలలు గలఖర్జూరపుచెట్టుండినయెడల దానికిఁ బడమర మూడుమూరలదూరమునందు మూఁడుమట్లులలోతున స్వచ్ఛజలముండును. తెల్లపూవులు పూచుమోదుగచెట్టుండిన దానికి దక్షిణమునందు మూఁడుమూర. దూరమునందుమూడుమట్లులలోతున జలము లుండును. ఏప్రదేశమునందు వేడిపొగ లుండునో యచ్చట రెండునిలువులలోతున నధికప్రవాహముగల జలధార యుండును ఏప్రదేశమున బైరులు నలుప్రక్కల కోమలముగ నుండి మధ్యయందు వాడిపోయి యుండినను తెలుపువర్ణముకలిగియుండినను మిక్కిలి కోమలముగ నుండినను నచ్చట నధికప్రవాహము గలజలధార నిలువులోతున నుండును.

మఱియు కొన్ని నిర్జలప్రదేశములయందు జలనాడులస్వరూపమును జెప్పెదను. మరుభూమిః యనఁగా నిర్జలమైనకొండలయందుండు నరణ్యభూమి. ములుమోదుగుచెట్టుకు పడమర పుట్టయుండిన దానిదక్షిణమునందు మూఁడుమూరలదూరమునందు౧౨నిలువులలోతున పడమటినుంచి ప్రవహించెడు జలనాడియుండును. దురదగొండిచెట్టుకుత్తరమునందు పుట్టయుండిన దానికి మూఁడుమూరలదూరమునందు ౧౦ మట్లులలోతున దక్షిణమునుండి ప్రవహించెడుజలనాడి యుండును. మఱియు నిలువులోతున పచ్చనివర్ణము గలకప్పయుండును. మఱియునుమద్దిచెట్టుకుత్తరమూన పుట్టయుండినయెడల దానికి దక్షిణమునందు రెండుమూరల

దూరమున, ౧౫ పురుషుల ప్రమాణమున దక్షిణము నుంచి ప్రవహించెడు క్షారజలనాడి యుండును. అంగు రెండుమట్లులలోతున ముంగిసయు యెఱుపురంగుగలరాయియు దాని క్రింద నెఱ్ఱని మృత్తికయు నుండును. మఱియు మోదుగుచెట్టు రేణిచెట్టు కలిసియుండినయెడల దానికి దూర్పున మూఁడు మూరలదూరము నందు ౨౦ మట్లులలోతున సమృద్ధి కలక్షారోదకజలధారయుండును. మారేడుచెట్టు మద్దిచెట్టు కలిసియుండిన దానికి పశ్చిమమున మూఁడుగజములదూరమునందు ౨౫ మట్లులలోతున జలసమృద్ధి యుండును. పుట్టమీద దర్భగాని గరికగాని తెల్లగనుండినయెడల నచ్చట౨౫మట్లులలోతున జలము సమృద్ధిగలిగియుండును. పుట్టలమధ్యయందు ములుమోదుగుచెట్టుండి దానిచుట్టుచెట్లున్నను ననేకము లగుచెట్లుమట్టుకొనియున్నను నాచెట్టున కుత్తరమునందు నాలుగుమూరలు పదునాఱంగుళముల దూరమున నలువదినిలువులలోతున నొకశిలయు దాని క్రింద నుత్తరమునుంచి ప్రవహించెడుజలనాడియుండును మఱియు నాలుగుపుట్టలుకలిసియుండివాటిమధ్యను తెల్లనిపుట్టయుండిన నాప్రదేశమునందు ౧౫ మట్లులలోతున నుదక ముండును. ఒక్కవర్ణము గలభూమియందుపచ్చిక, పుట్టలు, మ్రాకులు, తీఁగలు, లేకపురియేదైనాయొక్కవికారముకనిపించినయెడలనచ్చటనుదకమునుండును. మఱియు మృదువుగా నుండుభూమియందును, మఱియు పల్లపునేలయందును, ఇసుకనేలయందును ౫నిలువులలోతున నుదక ముండును. మఱియు కోమలముగా వృక్షములు కలచోటికి దక్షిణమునందు నాలుగుమట్లులలోతున జలములుండును. వికారముగ

నుండుచెట్లమధ్య మనోహరవృక్షమ్ముండిన నచ్చోట జలము లుం డును. నిర్జలభూమియందు ముండ్లచెట్లు లుండిన నైన దానికిదక్షి ణమునందు నిలువులోతున నుదకము లుండును. పల్లముగ నుండునేలను నొకనిలువులోతున జలము లుండును. పక్షులులేని చోట నడుగు బెట్టిగా గుంట పడినయెడల నచ్చోట నాలుగు ని లువులలోతున జలము లుండును. శీతకాలమున వేడిగను, వేసవి కాలమునఁ జల్లఁగ నుండుచోట్లను ఇంద్రధనుస్సుకాని, మత్స్యా ములుకాని, పుట్టకాని యుండిన దానికి నాలుగు మూరలదూర ముండిన నందు మూడున్నరనిలువులోతున జలములుండును పుట్ట లనడుమ పెద్దపుట్టయుండినను చెట్లనడుమ నొకచెట్టు ఎండిపో యినను ఎండిపోయిన చెట్టుమట్టు మఱియొకచెట్టు మొలవక పోయినను, పైరులు పెట్టినచోట నడుమనెండిపోయినను అచ్చ టజలము లుండును. మఱియు మోదుగు, మఱ్ఱి, మేడిచెట్లు యివి యొకటొకటి చేరియుండినను రావి, మఱ్ఱిచెట్లు చేరియున్నను వాటిక్రింద నుత్తరమునుంచి వచ్చెడుజలధార లుండును. ఇది వరలో పురుషప్రమాణమునకు ౧౨౦ అంగుళము లనియు, నిలు వనియు తెలియవలయును.

బావులు త్రవ్వునపుడునడుమ రాళ్లు దొరికితే వానిని భేదిం చుటకును నాయుధములపదను చెడకుండుటకును విధానము మయమతమునందు:—

అభేద్య ప్రస్తరాణాం తు దళనే వాతపోతకైః,
శితిసారేంధనైర్దగ్ధ్వా సుధాతోయేన శామ-
యేత్.

చావి త్రవ్వునపుడు శిలలు కనిపించిన వానిని పగలగొట్టుటకు మోదుగుకట్టెలను దూబరకట్టెలను కాల్చి యాబూడిదను సున్న పునీళ్లలో కలిపి రాతిని తడిపి పగులఁగొట్టిన రాయి పగులును.

ప్రాగుక్తవ ద్దగ్ధశిలాంకుశానాం గోలీఢకానాం
భసితా స్తవారా, త త్తేన సిక్త్వా కిల స ప్తవారం
ప్రస్ఫోటయే ద్విస్ఫుట మంబుకాంక్షిణః. 9

పూర్వమునందు చెప్పినమోదుగు తూబరకట్టెలను కాల్చిన బూడిదను, దర్భలభస్మము, మొక్కలపుచెట్టుచెక్కలను, కాల్చిన బూడిదను నీళ్లలో గలిపి యానీళ్లు చక్కగా కాచి కాల్చిన బండమీద ౭ పర్యాయములు పోసి తడుపగా రాళ్లు పగులును.

మనుమతము:—

అపామార్గం సోమవల్లీమూలకానాం దళం త్వ
చః, కులకం తిలనాళాని తేషాంభూతి స్తుగోజలే.
నిక్షిపే దగ్నినాతప్తా స్తత శ్చాశ్మసు పాయితమ్,
ఏవంకుల్యా చ్ఛిలాసంఘం భిద్యతే పృధివీతలే.

ఉత్తరేణు, తిప్పతీఁగె, వేపచెక్క, ఆకు, తూబరకట్టెలు, నువ్వుకట్టెలు, వీనిబూడిదను ఆవుమూత్రములో కలిపి కాచి ఆఱుదినములు రాళ్లమీఁదఁ బోసి నానపెట్టినయెడల శిలలుపగులును.

వరాహమిహిరునిమతము:—

గోమూత్రేణాక్వాథితక్షారయోషాం
షట్కృత్వోత స్తాపితో భిద్యతేఽశ్మా. 11

పైనచెప్పినచెట్లబూడిద కలిపి గాచినయావృసంచితముతో ఆయుధపర్యాయములు తడిపిన రాయి పగులును (మఱియు శృంగి భస్మము, ఎలుకపెంటికలు, జిల్లేడుపాలు, పావురపుమలము ఇవి యన్నియు మంచినువ్వుల నూనెతో మర్దించి ఆయుధములకు పూసి నానబెట్టి ఆయాయుధములచేత రాళ్లనుకొట్టగా పగిలిపోవును. ఆయుధములవాడి చెడకయుండును. మఱియు తేటమజ్జిగ, ఉలవలు, కల్లు, బియ్యపుకడుగు, రేణికాయలు యివియన్నియు బాగా కాచి రాతిబండలపైన ౭ దినములు పోయగా రాళ్లు పగులును.)

బ్రహ్మవాస్తువునందు:—

కాష్ఠీలా రక్షయా యుక్త మధితే తప్తమాయ
సమ్, క్షిప్త మేకదినం భంగ మాప్నోతి న శిలా
దిషు. 12

అరటిపట్టలను కాల్చి యాబూడిదను మజ్జిగయందు కలిపి చక్కగా కాచినయాయుధములను పైమజ్జిగయందొకదిన మంతయు నానబెట్టి శిలపైన కాని మోహముపైన కాని ప్రయోగించగా నాయుధములు చెడకయుండును.

జలార్గళమున:—

క్షారే కదళ్యా మధితేన యుక్తే
దినోషితే పాయిత మాయసం యత్,
సమ్యక్ శితం చాశ్మని నైతి భంగం
న చాన్యలోహే ష్వపి తస్య కౌంఠ్యమ్. 13

ఆ:ఘుట్టలబూడిద కలిపినమజ్జిగయందు చక్కగా కాచి నయాయుధముల నొకదిన మంతయు నానబెట్టి యాయాయుధములచేత రాళ్లు,యినుము మొదలగువానిని పగులఁగొట్టిన నాయుధములు మొరవపోక యుండును.

## చెరువుల నేర్పఱచువిధము.

జలార్గళమునందు:—

పాలీ ప్రాగపరా యితాంబు సుచిరం ధత్తేన యామ్యోత్తరా, కల్లోలై రవదార మేతి మరుతా సా ప్రాయశః ప్రేరితైః, తాం చే దిచ్ఛతి సారదారుభి రపాం సంపాతమావారయేత్, పాషాణాదిభి రేవవా ప్రతిశయంత్యుణ్ణాద్విపశ్వాదిభిః.

చెరువులకు కట్టలు పూర్వపశ్చిమములుగా వేసినయెడల చాలాకాలము నీరు నిలిచియుండును. దక్షిణోత్తరములుగా కట్టలువేసిన నలలు కొట్టి శీఘ్ర కాలమునందే శిథిలమౌను. కనుక చెరువులకట్టలు బలిష్ఠము లైనచెట్లచేతను శిలలచేతను ముందుభాగమును కట్టి, వెనుకభాగమును మట్టిచేత కట్టి ఏనుగులు, పశువులు మొదలగువానిచేతఁ ద్రొక్కించి గట్టిగ నుండునట్లు చేయవలయును. కట్టలపైన మఱ్ఱి, మామిడి, యెఱ్ఱమద్ది, యీత మొదలగుచెట్లు వేయవలయును.

మఱియు నీ రుప్పుగా నున్నను, చేదుగా నున్నను, బురదగా నున్నను, దుర్గంధముగా నున్నను, ఎఱ్ఱమద్దిచెక్క, తుంగగడ్డలు, వట్టివేరు, శొంఠి, బీరవిత్తనములు, నెల్లివరుగు, చిల్లగింజలు వీటిని పొడిచేసి వేయుగా మధురమౌను.

మఱియు బావులు త్రవ్వినపుడు జలముపడనియెడల దానికి మత్తిశంకువును కాని భగినీశంకువును కాని కొట్టి భావిని పూర్తిగా త్రవ్వించి అయిన పిమ్మట వరుణపూజను చేసి భూతబలిని యిచ్చి గూటమును తీయఁగా జలము పూర్ణముగా పడును.

త్వష్ట్రమతము:—

ఆగ్నేయాదిత్రికోణేషునకుర్యాచ్ఛంబరాలయమ్,
శేషస్థానేషుశుభదం గ్రామాదీనామిదంస్మృతమ్.

గ్రామములు, పట్టణములు, పల్లెలు మొదలగువానియందు బావులను, ఆగ్నేయ, నైరృతి, వాయవ్యదిశలయందు తీయఁగా నధికదోషములను కలిగించును.

ఇందును వరాహమిహిరునిమతము:—

ఆగ్నేయే యది కోణేగ్రామస్య పురస్య వా భవ
తి కూపః, నిత్యం కరోతి దాహం జల మపి త
త్రైవ చంచలప్రాయమ్, నైరృతికోణే బాలక్ష
యం చ వనితాక్షయం చ వాయవ్యే, దిక్త్రయ
మేత త్త్యక్త్వా శేషా స్తు శుభావహాః ప్రోక్తాః. 16

ఆగ్నేయదిశయందు జలభావమును, సంతాపమును గలుగును. నైరృతిదిక్కునఁ బుత్రహానియు, వాయవ్యదిశను భార్యకు నాశ మును గలుగును.

మఱియు మయమతమునందు:—

దక్షిణే త్వశుభం వింద్యా త్తథా వరుణభాగకే.

దక్షిణభాగమునందును పడమరదిశయందును బావులను త్రవ్వఁదగదు.

వాస్తుసంగ్రహమునందు:—

పుష్టిం భూతిం పుత్రనాశం పురంధ్రీ
నాశం మృత్యుం సంపదం శస్త్రబాధామ్,
కించి త్సౌఖ్యం శంభుకోణాది కుర్యా
త్కూపస్థానం సద్మ మధ్యే ర్థహానిమ్. 18

ఇంటియావరణభూములయందు నీశాన్యము మొదలెనిమిది దిశలయందు బావి త్రవ్వించిన యెడల నాయాదిశలయందుక్రమముగా ఫలమును చెప్పుచున్నారు. ఈశాన్యమునందు పుష్టి, తూర్పుదిశయందు సంపద, ఆగ్నేయమునందు పుత్రనాశనము, దక్షిణమున భార్యానాశనము, నైరృతిదిశయందు మరణము, పడమరదిశయందు సంపద, వాయవ్యదిశయందు శస్త్రబాధ, ఉత్తరమున నల్పసౌఖ్యము కలుగును.

మఱియు:—

ప్రాచ్యాది దిక్థ్సే సలిలే సుతహాని శ్శిఖిభయం
రిపుభయం చ, స్త్రీకలహం స్త్రీదౌష్ట్యం నిష్ఠా చిం
తాఽఽత్మజవివృద్ధిః. 19

ఇందు తూర్పు మొదలెనిమిదిదిక్కులకును:—౧ పుత్రనాశనము, ౨ అగ్నిభీతి, ౩ శత్రుభయము, ౪ స్త్రీకలహము, ౫ స్త్రీవ్యభిచారము, ౬ నిష్ఠ, ౭ చింత, ౮ పుత్రవృద్ధి యీఫల

ములు గలుగును. ఈమతమున నీశాన్యముతప్ప మరి యేదిశయందు బావిత్రవ్వుట తగ దనిచెప్పియున్నది.

చిత్రా స్వాతిపునర్వసూ మృగశిరా మూలాఽ
శ్వినీ రోహిణీ, హస్తః పుష్యధనిష్ఠకే శతభిష
జ్మిత్రోత్తరా రేవతీ, ఏతేషు శ్రవణాన్వితే చమక
రే లగ్నే చ కుంభే ఝషే, వాపీకూపజలాశయా
దిఖననం శస్తం ప్రశస్తే దినే. 20

వాపీకూపతటాకాదులను త్రవ్వించుటకు యోగ్యమైనకాలములను చెప్పుచున్నాఁడు:—

చిత్త, స్వాతి, పునర్వసు, మృగశిర, మూల, అశ్విని, రోహిణి, హస్త, పుష్యమి, ధనిష్ఠ, శతభిష, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి యీ నక్షత్రములయందును, శ్రవణనక్షత్రముతోఁ గూడిన మకరలగ్నమునందును, కుంభ మీనలగ్నములయందును, శుభగ్రహవారములయందును, (అనఁగా గురు బుధ శుక్ర సోమ వారములయందును, ౨, ౩, ౫, ౭, ౧౦, ౧౩ యీతిథులయందు బావిమొదలైనవి త్రవ్వించినయెడల మంచిమేలు కలుగును.)

వాస్తు సంగ్రహమునందు:—

అజైకపా ద్భాగ్య వహ్ని విశాఖాసురతారకాః,
పూర్వాషాఢా మఘాశ్లేషా యామ్యాఖ్యా
స్స్యురధోముఖాః, వాపీకూపతటాకానా మా
రంభే సుఖదాస్స్మృతాః.

పూర్వాభాద్ర, పుబ్బ, కృత్తిక, విశాఖ, మూల, పూర్వాషాఢ, మఖ, ఆశ్రేష, భరణి, యీ యధోముఖనక్షత్రముల యందు కూపముమొదలగువాని నారంభింపఁగా జలసమృద్ధికలిగి యుండును.

ఇందుకు కాలామృతమునందు:—

"కూపాదా తు పితృద్విదైవదనుజా హ్యగ్నిత్రి
పూర్వాంతకాః." 22

అనియు,

జలార్గళశాస్త్రమున:—

శ్రవణాశ్చానూరాధాతిష్యధనిష్ఠోత్తరాణిరోహిణ్యః,
శతభిషగిత్యారంభే కూపానాం శస్యతే భగణః.

గార్గ్యమతమునందు:—

లగ్నాదికోణకేంద్రే వా ఇనభౌమార్కసూనవః,
తదూర్ధ్వభవా గోపలా దృశ్యా ఇతి గార్గేణకీర్తితమ్.

లగ్నమునందును, లగ్నమునకు ౫, ౯ స్థానములయందును, ౪, ౭, ౧౦ యీస్థానములయందును, సూర్యాంగారకశను లుండిన నాబావియందు శిలలుండును.

మఱియు ముహూర్తమార్తాండమునందు:—

"ఉదాహ్వహర్క్షహరిత్రయాదితి హాయే జర్క్షై స్త
ట్టాకాదయో, జ్యేజ్యాబ్జై స్తనుగై స్సితే దశమగే
సిద్ధ్యంతి సదా్వసరే." 25

వివాహప్రశస్తములైన ౧౧ నక్షత్రములు అనఁగా రేవతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు, రోహిణి, హస్త, మఘ, స్వాతి, మృగశిర, అనూరాధ, మూల యీనక్షత్రముల యందును; శ్రవణము, దనిష్ఠ, శతభిష, పునర్వసు, అశ్విని, పుష్యమి యీనక్షత్రములయందును, శుభవారములయందును, చంద్రబుధబృహస్పతులు లగ్నస్థానమునందున్నపుడును శుక్రుఁడు దశమస్థానమందుండఁగాఁ దటాకాదులను ప్రారంభము చేసిన సుఖము జలసమృద్ధియు కలుగును.

"సర్వతోయాశయారంభః కర్తవ్యోవిమలైఃఖగైః,
లగ్నస్థే జ్ఞేఽథవా జీవే లగ్నభే జ్ఞేసితే ఖగే"

అని కుమారవాస్తువునందును:—

"నక్రాళికర్కికుంభేషు జలవృద్ధిః ప్రకీర్తితా,
కోదండవృషసింహేషు మధ్యమం పరికీర్తితమ్,
శేషే ష్వంబువిహీనా స్యు రితి శాస్త్రస్య నిశ్చయః." **27**

మకరవృశ్చిక కర్కాటక కుంభలగ్నములయందు కూపారంభము చేసిన నైనజలవృద్ధియు, వృషధనుసింహలగ్నములయందు స్వల్పజలమును, మిగిలినమేషాదిలగ్నములయందు జలాభావము గుననియు చెప్పినను, విశ్వసారరుద్రవాస్తు మొదలైన గ్రంథములయందు "మీనే త్వత్యంతశోభనమ్" అని చెప్పియుండుటవల మీనలగ్నము శుభప్రద మని యెఱుంగవలయును.

ఇం దింకను చెప్పదగినవిశేషములు కలవు గ్రంథవిస్తరభీతిచే సారాంశము మాత్రము సంగ్రహించి చెప్పఁబడినది.

ఇట్లు వాస్తుసర్వస్వమునందు జలవాస్తువను
రెండవ ప్రకరణము.

---

# వాస్తుసర్వస్వము.

## ధనవాస్తువు.

వాస్తుశాస్త్రాణిసర్వాణి సమాలోడ్యయథామతి,
ధనవాస్తుప్రవక్ష్యామి వాస్తుసర్వస్వసంగ్రహే.

| ౧౮ | అ | ౨ | ౮ |
|---|---|---|---|
| అ | బ | క | మ |
| ౬ | ౩ | ౨౧ | ౨౦ |
| గ | య | జ | థ |
| ౨౩ | ౧౫ | ౫ | ౧ |
| త | స | న | ల |
| ౪ | ౯ | ౧౯ | ౨౨ |
| ప | ట | హ | ద |

ఈచక్రమునందు ౧౬ గదులలోను పృచ్ఛకుని యిష్టము వచ్చిన గదిని స్పృశించుమని చెప్పి యా యక్షరము యొక్క దిక్కును తెలిసికొని చతురశ్రముగా సూత్రమును వేసికొని ఆస్థలము నెఱిఁగి చెప్పవలయును. ఏ ప్రకారమనఁగా:—అకారమును స్పృశించి ప్రశ్నచేయఁగానీశాన్యఇంద్రదిక్కులమధ్యమునందు ధనముండుననియును, బ, తాకినయెడల తూర్పునందును, క, స్పృశించినయెడల ఇంద్రాగ్నిమధ్యమునందును,

ము, స్పృశించినయెడల అగ్నిదిక్కునను, గ, తాకిన నాగ్నేయ దక్షిణమధ్యమునందును, య, తాకిన దక్షిణమునందును, జ, స్పృశించిన దక్షిణనైరృతిమధ్యమునందును, ర, స్పృశించిన నైరృతిదిశయందును, త, స్పృశించినదైన నిరృతిపశ్చిమమధ్యమందును, స, స్పృశించినదైన పశ్చిమమునందును,న, స్పృశించినయెడల పశ్చిమవాయవ్యములనడుమను, ల, స్పృశించిన వాయవ్యమూలయందును, ప, తాకినయెడల వాయవ్యోత్తరదిశలనడుమను,ట, స్పృశించిన నుత్తరమునందు, హ, స్పృశించిన నుత్తరేశాన్యములనడుమను, ద, స్పృశించినయెడల నీశాన్యమూలయందును ధన ముండును. క, స్పృశించినను, ష, స్పృశించినను మధ్యమునం గుండును. తూర్పునను, ఆగ్నేయమునను, దక్షిణమధ్యమునందును నుండును. దొంగునని యు తెలియవలయును. ఈగ్రంథమునందు దిక్కు లనఁగా నింద్రాగ్నియమనిర్‌ృతిపశ్చిమవాయవ్యోత్తరఈశాన్యము లనియు, విదిక్కు లనఁగా వానివానిమధ్యప్రదేశము లనియు తెలియవలయును. క్రమముగా దిక్కులయందు ౧, ౨ లేదు. ౩ పలాయనము. ౪ లేదు. ౫ పరులవశ మౌను. ౬ పాము కాచియుండును. ౭ తావుమాఱినది. ౮ ఉన్నది క్రమముగా ప్రాప్తమగును. నైరృతిదిశయందు దొరికి మోస మౌను. పశ్చిమమునందు దొరికి పుత్త్రులను లభించును. వాయవ్యమునందు గ్రహముండును. ఉత్తరమున మఱియొకపదార్థ మండును. దక్షిణము

నం దున్నది కాని దొరకదు. ఈశాన్యమునందు రాహువు సంగ్ర
హించియుండును కనుక ఆహారమును కోరును. ఈరీతి నెఱిఁగి ఫల
ములు చెప్పవలయును.

శిల్పశాస్త్రమున:—

ఇష్టనాడ్య శ్శరహతా లోచనేన విభాజితాః,
అన్వితా మునినా చాధ మాతంగేనవిభాజితాః.
తచ్ఛేషం ఫల మిత్యాహుః క్రమా ద్వాస్తు
ప్రవీణకైః ఏకేన స్వర్ణనిక్షేపం ద్వితీయే కాష్ఠభ
స్మని. తృతీయే తామ్రలోహే చ చతుర్థే కీక
సం స్మృతమ్, పంచమే రత్నరాజి స్యాన్యత్ షష్ఠే
భిన్నా చ దేవతా, సప్తమే శల్య మాప్నోతి ని
క్షేపం చాష్టమం స్మృతమ్. 1

పృచ్ఛకుఁడు ఇచ్చట ధన మున్నదా యని ప్రశ్నచేయఁ
గా అచ్చటి కెన్నిగడియలో వాని నైదింట గుణించి రెంటిచేత
భాగింపఁగా భా ౧-కి ౭ సంఖ్యనుచేర్చి ౮-ట భాగింపగా ౧
నిలిచిన బంగారము, ౨ మిగిలిన కష్టైలు, భస్మము, 3 మిగిలిన
తామ్రము, లోహము, ౪ మిగిలిన శల్యములు, ౫ మిగిలిన రత్న
ములగుంపు, ౬ మిగిలిన భిన్నమైపోయినవిగ్రహము, ౭ మిగి
లిన శల్యములు, ౮ మిగిలిన నిక్షేపము (గనపు ప్రాతర) దొర
కును.

అర్కాదిత్రీణిమధ్యాదిత త్తత్సంఖ్యాష్టదిక్షు చ,
యత్రయత్ర స్థితే చంద్రే తత్ర తిష్ఠ తద్ధనమ్.

తొమ్మిదిగదుల చక్రమునువ్రాసి దానిమధ్యయందు సూర్యుఁడుండు నక్షత్రము మొదలు తూర్పు మొదలు ౮ గదులయందును మూఁడుమూడుఁనక్షత్రములనువ్రాసిన నేగదియందు చంద్రుఁడుండునో ఆస్థానమునందు ధననిక్షేప ముండును. ఉదా.— సూర్యుం డశ్వినినక్షత్రమునం దుండునపుడు నడిమి గదిలోపల అశ్విని, భరణి, కృత్తిక యీమూఁడునక్షత్రములును, తూర్పుగదియందు, రోహిణి, మృగశిర, ఆర్ద్రలును ఈరీతి నెనిమిది దిక్కులయందును వ్రాయవలయును.

కేరళీయమునందు —

సూ. "సంఖ్యాపిండఘనేన గతఘటికాత్క్షోధార్థం భాజ్యమ్. అలింగితే పృచ్ఛకనామసంఖ్యయా. అభిధూమితేసందిగ్ధస్థలప్రశ్నస్థలాంతరధనుస్సంఖ్యాభాజితమ్. దగ్ధే సూర్యనక్షత్రసంఖ్యాభాజకమ్. అభిధూమితేతత్కాలగత చంద్రనక్షత్రసంఖ్యాభాజకమ్. అభిఘాతికే చాంద్రమానగతదినసంఖ్యాభాజకమ్. అభిహితే సౌరమానగతదినసంఖ్యాభాజకమ్. సంయుక్తే ప్రభవాదిగతాబ్దసంఖ్యాభాజకమ్. విషమశేషే నిక్షేపో వర్త... సమశేషే నాస్తి. తల్లబ్ధం ద్వాభ్యాం విభజేత్ ఏకేన న లభ్యతే. ద్వాభ్యాం లభ్యతే. పునస్తచ్ఛేషేణ తల్లబ్ధం సంగుణ్య ద్వాదశభి ర్విభజేత్ శేష మాలభ్యతే. పునస్తల్లబ్ధం వర్గీకృ

త్య త్రింశతా విభజేత్. శేషదినే లభ్యతే. పునస్తల్లబ్ధవర్గం షష్ట్యా విభజ్యతే. శేషఘటికాయాం లభ్యతే. ప్రథమలబ్ధం దశభి స్సంగుణ్యాష్టభి ర్విభజేత్. శేష ఇంద్రాదిదిఙ్నిర్దేశః. పునః ప్రథమవర్గలబ్ధంవర్గంకుర్యాత్. తావంతినాణకాని భవేయుః. సంయుక్తే తత్ప్రమాణగిణే పాద మభిధూమితే త్వష్టమాంశం దగ్ధే శతాంశం జానీయాత్. 3

ప్రశ్నాక్షరసంఖ్యాసముదాయము యొక్క, ఘనము చేత సూర్యోదయము మొదలు కడచినగడియల షోడార్థమును, భాజ్యముగా నుంచుకొని యాభాజ్యమును పృచ్ఛకుఁడు కుడిచేతినుండి తనదేహమును స్పృశించుచు ప్రశ్న నడుగఁగా అది యాలింగిత ప్రశ్న యనియెఱిఁగి యాప్రశ్నయందు పృచ్ఛకునినామాక్షర సంఖ్యనుంచి భాగించవలయును. ఎడమచేతను కుడిచేతను కూడా తనశరీరమును తాకుచు ప్రశ్నచేయఁగా నది యభిధూమిత మని పించుకొనును. ఈ ప్రశ్నయందు ధనమువిషయము సందేహపడిన స్థలమునుంచి ప్రశ్నచేసిన స్థలమునకును, మధ్యభూమి యెన్నిధనుస్సులప్రమాణ ముండునో, ఆసంఖ్యతో విభాగించవలయును. మార్గమున పోవువాఁడును, వాహనము నెక్కినవాఁడును, అవశ్యము లేనివాఁడును, కురుండి యుండువాఁడును, ఏమియు చేతలేనివాఁడును ప్రశ్న యడిగిన నది యసంయుక్తప్రశ్న యనిపించును. ఈప్రశ్నయందు దరిద్రుఁడు గతించిన

నక్షత్రసంఖ్యచేతను, ఏడ్చుచును, దుఃఖించుచును, నీళ్లసమీ
పమునందును, నయము తోఁచను, నీచస్థలమునందును, భక్తి
లేకను, గుడ్డివానినికాని, పొట్టివానినికాని, కుష్ఠరోగినికాని,
కుంటివానినికాని, లంజెకొడుకునుగాని తాకుచు ప్రశ్నచేసిన
యెడల నది దగ్ధప్రశ్నయనిపించుకొనును. దీనియందు సూర్యుఁ
డు గతించిన నక్షత్రముల సంఖ్యచేతను,తల, ఱొమ్ము,నడుము,
చేతులు,కాలు యివితోఁచుచు ప్రశ్నయడిగిన నభిఘాతప్రశ్న
మనఁబడును. దీనియందు సంక్రమణము మొదలు తత్కాలము
వఱకు కడచినదినముల సంఖ్యచేతను ఎడమచెయ్యినుంచి యెడమ
ప్రక్క తాకుచు ప్రశ్నవడిగిన నభిఘాతప్రశ్న మనఁబడును.
దీనియందు సంక్రమణము మొదలు తత్కాలమువఱకు కడచినది
నములసంఖ్యచేతను తనచేతనే తనశరీరమును ముట్టిన అదరినయె
డల సంయుక్తప్రశ్న మనఁబడును దీనియందు ప్రభవమొదలు
గతసంవత్సరములసంఖ్యచేతను పైనచెప్పిన భాజ్యమును భాగిం
పఁగా శేషసంఖ్య విషమమైనయెడల(అనగా ౧, ౩,౫)ఇట్టిసం
ఖ్యలైనయెడల నిక్షేపముండును. సమసంఖ్యలైనయెడల నుండ
నేరదు. ఆలబ్ధమును రెండుసంఖ్యచేత భాగింపఁగా౧మిగిలిన దొ
రకదు.౨మిగిలిన దొరకును. మరల నాశేషమునుంచి యాలబ్ధము
నుగుణించి ౧౨చేత భాగింపఁగా శేష మెంతమిగులునో [illegible]మా
సమునందు లభించును. మరల నాలబ్ధమును వర్గముగా పెట్టుకొని
౩౦ సంఖ్యచేత భాగింపఁగా మిగిలినసంఖ్య దినము. మరల నాల
బ్ధమును ౬౦ చేతభాగింపఁగా నిలచినసంఖ్య గడియలనియెఱుఁ
గవలయును. మొదటిలబ్ధమును ౧౦ చేత గుణించి ౭చేత భాగిం

పంగా శేషము తూర్పు మొదలు దిశలుగా నెఱుఁగవలయును మరల మొదటిలబ్ధము వర్గముచేసికొనిన యాసంఖ్యను సరియగు నాణ్యములు సంయుక్తప్రశ్నయందు లభించును ఆసంయుక్త ప్రశ్నమునందు తదర్ధము, ఆలింగితమునందు తదర్ధము, అభిధూమితమునందు తదర్ధము దగ్ధప్రశ్నము చేయఁగా౧౦-టనొకపాలు లబ్ధమగును ఇందులో పూర్వమునందు చెప్పిన సంఖ్యాక్షరక్రమమెట్లనిన—

సూ. అథ ప్రశ్నాక్షరేషు స్వరవ్యంజనసంఖ్యాసమష్టి జ్ఞానాయ స్వరాంకా జ్ఞేయాః అకారాదిత స్సప్తతయ షష్టిచత్వారింశత్పంచాశత్పూర్ణాని గగనం షష్టి స్సప్తతిర్వింశతి ర్నవతి శతే నే చ. 4

అవర్ణమునకు ౭౦. ఆ. ౭౦, ఇ, ౭౦. ఈ, ౬౦ ఉ, ౪౦ ఊ, ౫౦. ఋ, ౦. ౠ, ౦ ఌ, ౦ ౡ, ౦. ఏ, ౬౦. ఐ, ౭౦. ఓ, ౨౦. ఔ, ౯౦. అం, ౧౦౦. అః, ౧౦౦. ఇది స్వరసంఖ్యలని తెలియవలయును.

సూ. కాదిక్షాంతానాంస్వరగిరిషడ్వేదపూర్ణాని, సప్తర్తువేదగిరిపూర్ణాని, మరుదృతువేదాచలపూర్ణాని, శస్వరశాస్త్రవేదభూతశూన్యాని, స్వరమరుచ్ఛాస్త్రవేదభూతాని, గిరద్రిశాస్త్రవేద మరుత్స్వరర్తువేదాంబరపూర్ణాని చ. 5

వ్యంజనసంఖ్య, క, ౭. ఖ, ౭. గ, ౬. ఘ, ౪. ఙ, ౦. చ, ౭. ఛ, ౬. జ, ౪. ఝ, ౭. ఞ, ౦. ట, ౭. ఠ, ౬. డ,

౮. ఢ, ౭. ణ, ౦ త, ౭ థ, ౫. ద, ౮. ధ, ౯. న, ౦. ప, ౭. ఫ, ౭. బ, ౫. భ, ౮. మ, ౯. య, ౭. ర, ౭. ల, ౫. వ, ౮. శ, ౭ ష, ౭. స, ౫. హ, ౯. ళ, ౦. క్ష, ౦:—కొందఱు ఙ, ఞ, ౭. ఙ,ణ, ౭. అని వచించెదరు ఈరీతి కకారాది క్షకారాంతము, పైసంఖ్యలనెఱింగి చెప్పనొప్పును.

శ్లో. జ్యోతిష ప్రశ్నశకున శిల్పసాముద్రికాదయః,
స్వప్నశ్చ మంత్రతంత్రాణి క్వచిత్ఫలతి న క్వచిత్.

జ్యోతిషము, ప్రశ్నశాస్త్రము, శకునము, శిల్పము, సాముద్రికము మున్నగుశాస్త్రములును, కల, మంత్రములు, తంత్ర-ఇవి యొకప్పుడు ఫలించును. ఒకప్పుడు ఫలింపవు.

ఇట్లు వాస్తుసర్వస్వమున ధనవాస్తువను
మూఁడవప్రకరణము.

వాస్తుసర్వస్వము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. 1924.

## సంస్కృత గ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| కార్తీకమాహాత్మ్యము, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| బాలరామాయణము, సటీక | ... | 0 | 3 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము | ... | 2 | 0 |
| శ్రీమద్రామాయణము, సుందరకాండము, చిన్నసైజు | | 1 | 0 |
| డిటో సుందరకాండము ఆంధ్రతాత్పర్యసహితము | | 2 | 0 |
| డిటో ఉత్తరకాండము, మేలుప్రతి | ... | 1 | 4 |
| శ్రీమద్రామాయణము, సవ్యాఖ్యానచతుష్టయా విశిష్టము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో బాలకాండము, తాత్పర్యసహితము. | | 1 | 8 |
| అమావాస్యతర్పణము | ... | 0 | 1½ |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము, మేలుప్రతి. | | | |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము. | | | |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | | |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | | |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| ,, బ్రహ్మమేధసహితము | | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు | ... | 0 | 6 |
| మంత్రప్రశ్నములు, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| యజుర్వేద ఆరణ్యకము, సస్వరము | ... | 3 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనము, మూలము | ... | 0 | 2 |
| డిటో ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| ,, ఆబ్దికమంత్రములు | ... | 0 | 6 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 0 |
| రుద్రము, పురుషసూక్తమువగైరాలు | ... | 0 | 2 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 10 |
| ,, ద్వితీయభాగము | ... | 1 | 2 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు | ... | 2 | 0 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 1 |
| లస్మృతి, సాంధ్రటీక | ... | 0 | 3 |
| పరాశరస్మృతి ,, | ... | 0 | 12 |
| బుధస్మృతి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| బృహస్పతిస్మృతి ,, | ... | 0 | 3 |
| వృద్ధపరాశరస్మృతి, ,, | ... | 0 | 2 |
| శంఖలిఖితస్మృతి ,, | ... | 0 | 2 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| అద్వైతపంచరత్నము | ... | 0 | 2 |
| అద్వైతోపదేశపంచరత్నములు | ... | 0 | 2 |
| అద్వైతానుభూతి, ఆంధ్రతాత్పర్యవివరణసహితము | | 0 | 2 |
| ఆత్మబోధము, సటీక, చక్ర_నికూర్పు | ... | 0 | |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 4 |
| త్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 12 |
| దశప్రకరణము, సవ్యాఖ్యానము | | 1 | 4 |

ప్రతి 1-కి రు. అ

పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము ... 0

,, తెనుగువచనము ... 0

బ్రహ్మసూత్రములు, మూలము ... 0

,,శారీరకమీమాంసాభాష్యమునకు తెనుఁగువచనము 12

భగవద్గీతలు, మూలముమాత్రము ... 0

,, ఆంధ్రతాత్పర్యసహితము ... 1

,, ,, చిన్నసైజు ... 0

,,ఆనిబిసెంటుగారి ఇంగ్లీషు తర్జుమాతో ... 0

,, శ్రీరామచంద్ర సరస్వతీకృత ఆంధ్రటీకా తాత్పర్య సహితము, మతత్రయ భాష్యములనుండి అనేక అంశములిందుచేర్చి శ్లోకానుక్రమణికతో ముద్రింపఁబడినది ... 2

,, శాంకరభాష్యము, మేలుప్రతి ... 1

శ్రీమద్భగవద్గీతారహస్యము, బాలగంగాధరతిలకకృతము 3

వ్యవహారపంచకము, సాంధ్రతాత్పర్యము ... 0

వేదాంతస్తోత్రపంచకము ... 0

శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు ... 0

శుకాష్టకము ,, ,, ... 0

హరిమీడేస్తవము, సటీక, చక్కనికూర్పు ... 0

అమృతబిందూపనిషత్తు, సాంధ్రతాత్పర్యము ... 0

అద్వయతారకోపనిషత్తు ,, ... 0

అథర్వశిఖోపనిషత్తు ,, ... 0

ఆత్మబోధోపనిషత్తు ,, ... 0

ఆరుణేయ్యుపనిషత్తు ,, ... 0

ఈశావాస్యోపనిషత్తు ,, ... 0

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.